# ఈ నాటకాన్ని గురించి

శ్రీ వెంపో గారి గణనీయమైన తెలుగు కృతు లలో "జన్మహక్కు" నాటకం ఒకటి.

అంటరానివాళ్ళుగా అత్యంత శోచనీయమైన బ్రతుకును మానవజాతికి కళంకంగా అనుభవిస్తున్న మనుష్యుల హృదయాగ్ని ఈ నాటకానికి ఇతివృత్తం.

ఇదే ఇతివృత్తంతో తెలుగులో నాటకాలు లేవని కాదు. వున్నాయి. అయితే రచనావ్యాసంగంలో మెలుకువలెరిగిన శ్రీ వెంపో గారి కలం అస్పృశ్యతా నివారణకై వెలార్చిన యీ కళాఖండం క్రొత్తపుంతలకు మార్గదర్శకంగా తెలుగుప్రజలను యిప్పటికే అనేక ప్రదర్శనలద్వారా అలరింపజేసింది. ముద్రణరూపంలో మరింతగా తెలుగుప్రజల ఆదరాభిమానాల్ని చూరగొనాలని చేసిన మా ప్రయత్నానికి సంతసిస్తున్నాం.

— ప్రకాశకులు

## ఆంధ్ర నాటక కళాపరిషత్తులో పాల్గొన్న
## నటీనట వర్గం.



పారాయణశాస్త్రి : శ్రీ పి. ఉమామహేశ్వరరావు

శిష్యం : శ్రీ ఎ. కోదండరామయ్య

గోకర్ణం : శ్రీ లింగన్న

నీలకంఠం : శ్రీ డి. సోమేశ్వరరావు

తిరపతి : శ్రీ వై. డి. ప్రసాదరావు

సౌభాగ్యం : కుమారి దుర్గ

సీతారామ్మ : శ్రీమతి యం. యస్. శకుంతలాదేవి

కరుణమ్మ : శ్రీమతి సి. సరస్వతి

దర్శకుడు : శ్రీ ఎ. కోదండరామయ్య

సంగీతం : సత్యాం బృందం; గుడివాడ.

—:o:—

# ఈ నాటకంలో పాత్రలు

## సాంబమూర్తి:

50 సంవత్సరాల వయస్సు. సనాతనభావాలు. నెరసిన జుట్టు. కోరమీసము. కళ్ళకు జోడుతో ఎదటబడి మాట్లాడే వారికి భయం భయంగా కనిపిస్తాడు. పొడుగుపాటి లాల్చీ. ఎళ్ళగోచీపెట్టిన ధోవతి అతని మామూలు దుస్తులు.

## విశ్వం:

సాంబమూర్తి కొడుకు. 25 సంవత్సరాల వయస్సు. కాలేజీ గడపలు తొక్కిన అవకాశాన్ని దురుపయోగం చేసుకున్న భ్రష్టుడు. చివరికి తండ్రికి భారంగానే మిగులుతాడు. అధునాతనమనుకుంటున్న దుస్తులు.

## గోకర్ణం:

సాంబమూర్తి యింట్లో నౌకరు. 50 సంవత్సరాల వయస్సు. అమాయక తెలంగాణా ప్రాంత గ్రామీణుడు. వెనుక ముడి, మోకాళ్ళదాకా పంచికట్టు, చెవులకు పోగులు, దండ చేతికి కడియం, బనీను అతని వేషం.

## నీలకంఠం:

అసలు పేరు కాసులు. తిరపతి కొడుకు. 25 సంవత్సరాల వయస్సు. సైనికుడు. ఎత్తూ పొడవూగల మనిషి. మంచి

ప్రేమించే స్వభావం. ఇంటిదగ్గర మామూలు దుస్తులు. ఒక సందర్భంలో మాత్రం సైనిక దుస్తుల్లో కనిపిస్తాడు.

తి ర ప తి :

అస్పృశ్యుడు. 50 సంవత్సరాల వయస్సు. తలపాగా, బనీను, మోకాళ్ళవరకూ పంచెకట్టు అతని దుస్తులు. అనారోగ్యంగా వుంటాడు.

కృ పా నం దం :

తిరపతి కొడుకు. 11 సంవత్సరాల వయస్సు. విద్యార్థి. శుభ్రమైన షర్టూ, నిక్కరూ అతని దుస్తులు.

సీ తా రా మ్మ :

సాంబమూర్తి చెల్లెలు. 45 సంవత్సరాల వయస్సు. విధవ. మనోనిగ్రహం కలిగిన మాతృమూర్తి.

కు సు మ :

సాంబమూర్తి పుత్రిక. 16 సంవత్సరాల వయస్సు. మిడిసిపాటెరుగని యువతి. గ్రామజీవితాని కనువైన దుస్తులు.

—:o:—

# జన్మహక్కు

## మొదటి దృశ్యం

—oo※oo—

[ సాంబమూర్తి యిల్లు. ఎదురుగావున్న గోడకు గాంధీ మహాత్మునిఫొటో, దానిప్రక్కగానే సీతారామమ్మభర్త చిత్రపటం అలంకరించబడి వుంటుంది. రంగంమీద ఎడమవైపుగా కుర్చీ, టేబిలు వుంటాయి. కుడివైపున మంచంవాల్చి వుంటుంది.

సాంబమూర్తి మంచంమీదకూర్చొని భగవద్గీతను చదువుతూవుంటాడు. సీతారామమ్మ దూదితీసుకొని వత్తులు చేస్తూ గీతను శ్రద్ధగావింటూవుంటుంది. కుర్చీమీద కుసుమ కూర్చొని అల్లికపని యేదైనా చేస్తూ గీతాపారాయణాన్ని వింటూవుంటుంది. టేబిలుమీద దారపువుండలు, కొద్దిగా పుస్తకాలు వుంటాయి. తెరపైకి పోతుంది.]

సాంబమూర్తి: చాతుర్వర్ణ్యం మయాం సృష్టం

గుణకర్మ విభాగశః
తస్యకర్తార మపిమాం
విద్ధ్య కర్తారమవ్యయమ్.

(వ్యాఖ్య) సత్వరజస్తమో గుణములనుబట్టి తపస్సమాధి కర్మలనుబట్టి నాచేతనే మానవులలో బ్రహ్మ, క్షత్రియ, వైశ్య శూద్ర అనే నాలుగు వర్ణవిభాగములు సృష్టించటం జరిగింది.

దానికి కారణభూతుడను నేనే. అయినప్పటికీ తద్విధంబుగా భావించక నన్ను నాశరహితునిగా తెలియుము.

ఈ విషయాన్నే ఇంకొక అధ్యాయంలో చక్కగా వివరించబడింది; చూడమన్నాయ్.

[ఆ అధ్యాయాన్ని తీసి తిరిగి గీతాపారాయణాన్ని ప్రారంభిస్తాడు. ఈ సమయంలో గోకర్ణం కుడివైపునుంచి ప్రవేశించి శ్రద్ధగా ఒదిగి కూర్చుంటాడు. అతనిరాక యెవరిదృష్టినీ చంచలం చెయ్యదు.]

బ్రాహ్మణ క్షత్రియ విశాం
శూద్రాణాంచ పరంతప
కర్మాణి ప్రవిభక్తాని
స్వభావ ప్రభవైర్గుణైః.

(వ్యాఖ్య) ఓ అర్జునా! బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులయొక్క సమస్త కర్మలు ప్రకృతి సిద్ధములగు సాత్వికాది గుణములనుబట్టియే వేరువేరుగ నున్నవి.

శమోదమ స్తప శ్శౌచం
క్షాంతిరార్జవ మేవచ
జ్ఞానం విజ్ఞానమాస్తిక్యం
బ్రహ్మకర్మ స్వభావజం.

(వ్యాఖ్య) మనోనిగ్రహము, ఇంద్రియనిగ్రహము, నియమానుష్ఠానము, బాహ్యాభ్యంతర పారిశుధ్యము, సహనము,

ఋజువర్తనము, వేదశాస్త్రములయందలి సారము గ్రహించుట, ఆత్మ సాక్షాత్కారము, ఆస్తికభావము అనునవి బ్రాహ్మణునకు స్వాభావిక కర్మలు.

శౌర్యం, తేజో, ధృతిర్దాక్ష్యం
యుద్ధే చాప్య పలాయనం
దాన మీశ్వర భావశ్చ
క్షాత్రం కర్మ స్వభావజం.

(వ్యాఖ్య) శౌర్యము, పరాక్రమము, ధైర్యము, చాతుర్యము, యుద్ధమున వెన్ను చూపకుండుట, దానము, శాసనకర్తృత్వము అనునవి క్షత్రియునకు స్వభావసిద్ధములగు కర్మలు.

కృషిగోరక్ష్య వాణిజ్యం
వైశ్యకర్మ స్వభావజం
పరిచర్యాత్మకం కర్మ
శూద్రస్యాపి స్వభావజం.

(వ్యాఖ్య) కృషి, గోపాలము, క్రయవిక్రయ వ్యవహారము అనునవి వైశ్యునకు స్వభావసిద్ధములగు కర్మలు.

పై వర్ణములకు పరిచర్య గావించుట శూద్రునకు స్వభావసిద్ధమగు కర్మ.

మహాదేవశంభో! ఎంత చక్కగా వర్ణవిభాగం చెయ్యటం జరిగింది. గుణాన్ని బట్టి చేసేపని, చేసేపనినిబట్టి కులాన్ని ఆ శ్రీకృష్ణపరమాత్మ తానే స్వయంగా సృష్టించినట్టు అర్జునితో చెప్పనే చెప్పాడుగదా! ఆహాహా—

[ ఎడమవైపునుండి విశ్వం ప్రవేశిస్తాడు. అన్నయ్య కూర్చునే వుద్దేశంతో కుసుమ కుర్చీలోనుండి లేచి ఆప్రక్కనే నిలబడి వుంటుంది. ]

విశ్వం : చెప్పే వుంటాడుగాని నాన్నగారూ......నాకొక సందేహం (కుర్చీలో కూర్చొని) ఆ చెప్పినవాడు దేవుడే అయితే, దేవుడనేవాడు ఒక్కడే గనకైతే అమెరికా, రష్యా, బ్రిటన్ దేశాలలో వున్నవారికి ఈ విషయం చెప్పలేదా ? చెప్పితే అక్కడ ఈ బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర అనే కులాలు ఎందుకు లేవు ? (ప్రశ్నార్థకంగా తండ్రి ముఖంలోనికి చూస్తాడు.)

గోకర్ణం : గాడికి మీరెన్నడెత్రి దొరా !

విశ్వం : నోరుమూసుకోవోయ్......

సాంబ : (గీతనుమూసి, కొడుకుపై అసహ్యాభావంతో) గోకర్ణం, నువ్వూరుకో. దొరగారా దేశాలన్నీ తిరిగి చూడకపోయినా, చదివిన చదువెక్కడికి పోతుంది! ఆ చదువు, చిలుక పలుకుల్లాంటిది. (కొడుకును చూపుతూ) ఈ చిలుక ఆపలుకుల్నే పలుకుతుంది. విచక్షణాజ్ఞానం శూన్యం – మహాదేవశంభో – (మంచం మీదనుంచి లేచి గీతాగ్రంథాన్ని టేబులుమీద వున్న పుస్తకాలమీద పెడతాడు. విశ్వం కుర్చీమీదనుంచీ కిటికీవైపుకు వస్తూ—)

విశ్వం : పనిలేని ఆడవాళ్ళను కూర్చోబెట్టుకొని మెట్ట వేదాంతం బోధించేవారికి మా చదువును గురించి యేమర్థమౌతుంది ?

[ సీతారామమ్మ నవ్వులు చేస్తూనే అర్థోక్తిగా నవ్వుతుంది. కుట్టుపని ఆపి కుసుమ అన్నయ్యానంక తీక్షణంగా చూస్తుంది. ]

సాంబ : ఏమిటోయ్ నీచదువ్ ? చిల్లపెంకుల్లాగా నేను రూపాయల్ని వెదజల్లుకుంటూపోతే, చిలుక పలుకుల్లాగా నీవు నేర్చుకున్నది. ఆఖరికి భూమి గుండ్రంగా వుందనీ, నక్షత్రాలు సూర్యునికంటే ఎత్తుగా వున్నాయనేనా ? అంతకంటే మానవజీవితాన్ని గురించి నీవేమర్థం చేసుకున్నావ్ ? యేదర్థమైంది ? పనిలేని ఆడవాళ్ళని సంబోధించిన వీళ్ళకంటే యెక్కువగా నువ్వు వెలగబెట్టిందేమిటి ? చదువుకోసమని పంపితే పట్టణంలో అరాజకాన్ని లేవనెత్తి చివరికి యెవరి ఆశయాన్ని సిద్ధాన్నంగా చేసుకున్నావ్ ? పోనీ, యెక్కడైనా యీఆడవాళ్ళపాటి జీవిత విలువల్ని సాధించగలిగావా ? వీళ్లు గృహస్థాశ్రమ ధర్మానికి మూలస్తంభాలు. వీళ్లు నిర్వహించే మాతృత్వభారమే సృష్టికి యేకైకమార్గం. ఇక నీవు వహించే భారం ? అందరికీ తెలుసు ! మూడు పూటలా మూడు కంచాలు ! ! ఆపైన వృథా ఊళ్ళో తిరిగే కజ్జాలు ! ! !

విశ్వం: నాన్నగారూ! ఈ కంచాలు, కంచాలు అని నన్ను మాటిమాటికి దెప్పి పొడుస్తుంటంవల్ల భరించలేము. నాదారి నేను చూచుకుంటానని మీ కేనాడో చెప్పాను.

సీతారామ్మ: నాయనా విశ్వం!

విశ్వం: అత్తయ్యా, మీరూరుకోండి.

సీతా: అదికాదు నాయనా! (విశ్వం దగ్గరకు వెళ్ళి బుజ్జగిస్తూ) ఎవరిదారి వాళ్ళు చూచుకోవటమేనా తండ్రీ - కొడుకుల సంబంధం? ప్రయోజకుడవు కారా అని చెప్పే తండ్రికి నీవిచ్చే సమాధానం, దారులు వేరుచెయ్యమని కాదునాయనా! చీలినదారులు గమ్యస్థానాన్ని చేర్చవు. (నిట్టూర్చి సాంబమూర్తితో) అన్నయ్యా! నీవైనా అంతకఠినంగా అబ్బాయిమనస్సును నొప్పించటం.....

సాంబ: తగ్గించుకోమంటావ్! తగ్గించుకోక చేసేదిమాత్రం యేముందిలే అమ్మా. కర్మను అనుసరించి పోతున్న బుద్ధిని వెనక్కు మళ్ళించగలమా? (విసురుగా విశ్వం కుడివైపుకు నిష్క్రమిస్తాడు) చూచావా, చూచావా, వాడివిసురు? యెలాగూ నువ్వొచ్చి నన్ను లొంగదీస్తావని వాడికి తెలుసు. లొంగిపోయినవాడి నెత్తి తొక్కటం తప్ప ఈజన్మలో వాడిక మారడు.

సీతా: లొంగిపోక ఈవంశంలో మిగిలిన ఒక్కగాను ఒక్కణ్ణి కూడా దక్కకుండా చేసుకుంటావా అన్నయ్యా?

సాంబ : పోతే పోనీ! అప్పుడు నేనూ నీతో సమానమౌతాను.
(దుఃఖం పొర్లుకొస్తుంది.)

కుసుమ : (చేతిలోవున్న వాటిని టేబులుమీదపెట్టి) నాన్నా!
(తండ్రినిసమీపించి) నీవే అత్తయ్యముందు ధైర్యాన్ని
కోల్పోతే కన్నకడుపుకు యింకెంత కోతగావుంటుందో
అర్థంచేసుకుంటున్నావా ?

[ సీతారామ్మ గంభీరముద్రదాల్చి భర్త చిత్రపటం
దగ్గర ముకుళిత హస్తాలతో నిలబడి వుంటుంది. ]

సాంబ : అవునమ్మా; అవును! మీ అత్తయ్యకు నేను చేసిన
అపకారం యెట్లా అర్థంచేసుకున్నా తీర్చలేనిది తల్లీ.
మహాపరాధం చేశాను...మహాదేవ శంభో...

గోక : దొరా! గట్టజావ గార్తకేం దుండె. తిర్పతిగాడ్కి గాడి
కొడుకొత్తుండని జాబేసిండంట. సీతారామ్మోరి
కొడుకుగూడ వత్తడేందో లెండి.

సీతా : కాసులు వస్తున్నానని వ్రాశాడా గోకర్ణం ?

గోక : నీకాల్మొక్తా; గట్నే రాశిండు దొరసానే !

కుసుమ : మరి మన బావదగ్గరనుంచి ఉత్తరమేమీ రాలేదే
నాన్నా ?

సాంబ : యేమో తల్లీ! అదే అర్థం కాకుండా వుంది. (గోక
ర్ణంతో) కాసులు యెప్పుడు వస్తున్నానని వ్రాశాడు
గోకర్ణం ?

గోక : గాయిసయం పెట్టి రాయలేదట్ట దొరా. జల్దీ వత్తడన్న డట్ట. గంతేసూడు.

సీతా : కాసులొక్కడే తిరిగి వచ్చేస్తున్నాడు. నాకొడుకు తిరిగి రాడు. (భోరుభోరున యేడుస్తుంది.)

కుసుమ : అత్తయ్యా......(సీతారామ్మదగ్గరికి వెళ్ళి యేమీ చెప్పలేక 'నాన్నా' అని ముఖాన చేతులు కప్పుకొని వేగంగా యెడమవైపుకి నిష్క్రమిస్తుంది.)

గోక : దొరసానే......(సీతారామ్మదగ్గరికి వెళ్ళి యేమీ చెప్పలేక నిండాకుటై అక్కడే నిలబడిపోతాడు.)

సాంబ : నీకొడుకుని తిరిగి రాకుండా తల్లికి దూరంచేసిన పాపాత్ముణ్ణి నేనే మహాదేవశంభో! భర్త చనిపోయాడనీ, కసిగందుతో దిక్కులేనిపక్షివై పోయావనీ ఒక కడుపున పుట్టినవాళ్ళమవటంవల్ల ఆదరించుదామని ఈఇంటికి తీసుకొచ్చాను. కాసులుతోకలిసి మాల కూడు తింటూవుంటే చూచి సహించలేక పిల్లవాడు గదా అని నీకొడుకును దండించాను. ఆచిన్నతనం లోనే వాడెంత ఆత్మాభిమానం కలవాడుకాకపోతే నాకు శాశ్వతంగా శిక్షను విధిస్తాడు మహాదేవశంభో ! అమ్మా, సీతారామ్మా ! నేను నీకు చేసిన వుపకారం యేమాత్రం లేకపోగా తల్లివి నీహృదయంలో ఆరని చిచ్చు రగిల్చాను. నేను జీవించివుండగా నీకొడుకు నిన్నుకూడా చూడడు. మీ యిద్దరిమధ్యా నేనొక పెద్దరాక్షసుణ్ణి — రాక్షసుణ్ణి మహాదేవశంభో—

సీతా: (తెప్పరిల్లి, అన్నను సమీపించి) అన్నయ్యా! అన్నీ తెలిసినవాడివి నువ్వే నా ప్రారబ్ధానికి కారణమని ఎందు కంత గుండె పగిలిపోతావ్. లోకంలో మేనమామ అన్నవాడు మేనల్లుణ్ణి తప్పచేస్తే శిక్షించకుండా వుం టాడా? శిక్షించినదాని ఫలితం ప్రతిచోటా యిట్లాగే వుంటుం లేదుకదా! నాఖర్మకొద్దీ నేను భర్తను పోగొట్టు కొని, పెద్దఆస్తితో కూడిన సంసారాన్ని నిలుపుకోలేని దశలో తోడబుట్టినవాడవైన నీవు నాకాశ్రయమిచ్చి రక్షించావు. పన్నెండు సంవత్సరాల వరకూ లేని నిర్దా క్షిణ్యత నాకొడుకుపై ఆనాడే యెలా వచ్చిందనుకో గలను? భర్త మరణించినా ఎవని ఆధారంచేసుకొని బ్రతకటానికి నిశ్చయించుకున్నానో, ఆ ఆధారం కూడా నానొసట వ్రాసిపెట్టిలేదు. అందుకే ఆ కడుపు పంటకూడా దురదృష్టవశాత్తూ, నీ నెపంతో నాకు దక్కకుండా పోయిందన్నయ్యా. నాతోపాటు కారణమాత్రుడవైన నువ్వుకూడా యెడతెగని విచా రానికి గురైతే, ఇక నేను జీవించి వుండటం భూమికి భారం తప్ప, ప్రయోజనమేమీ వుండదు. (విచారం ముంచుకొస్తుంది.)

సాంబ: అలా అనకమ్మా, అలా అనకు. చూడూ. మనిద్దరం ఒకతల్లి కడుపున పుట్టాం. జీవనయాత్రలో చెరొక పరాయివారినీ సహాయంగా తీసుకొని యెవరిదోవన వాళ్ళం వేరువేరుగా ప్రయాణమయ్యాం. మధ్యవచ్చిన తోడునీడలు మధ్యలోనే గతించిపోయాయి. చివరికి

మనిద్దరనే ఒకరికి తోడుగా మరొకరం మిగిలిపోయాం. ఇందులో నీవు నాకు భారమైందెక్కడమ్మా? మాతృమూర్తివైన నీవు ఈ యింటిలో చల్లదనాలను చిలకరించకపోతే తల్లి దిక్కులేని నాబిడ్డ లేమైపోయేవారు? ఇవాళ యీ సంసారం యింతవరకైనా నిలిచివున్నదంటే, అది నీవు పెట్టిన భిక్షేనమ్మా! అందుకు బదులుగా నీకు శాశ్వతమైన దుఃఖాన్ని మాత్రమే కలిగించానని నాబాధ – మహాదేవశంభో!

సీతా : (కొంచెం ముఖం మళ్ళించి) ఆబాధ, ఆకొరత మనిద్దరి వరకే హద్దులేర్పరచుకొని ఆగిపోలేదన్నయ్యా. యేశుభ ముహూర్తాన చిన్నప్పుడు నీ కూతురుకు, నా కొడుకు, భర్తని పేరుపెట్టామో, ఆనాటినుంచీ కుసుమ హృదయంలో నీలకంఠం పతిదేవుడుగా అతుక్కొని పోయాడు. యుక్తవయస్సులో వున్న కుసుమకు యివాళబావను గూర్చిన తలపులు మనిద్దరికీ తెలియని కలతను కలిగించి వేధిస్తున్నాయ్. ఒకవైపున నేను తల్లిగా తల్లడిల్లిపోతూ మరొకవైపున ఆచిట్టితల్లి లోలోపల కుమిలిపోవటాన్ని చూడలేకుండా వున్నాను. కాసులొక్కడే తిరిగివస్తూ మనబ్బాయి రాకపోవటం మన ఆశలను అడియాసలు చేస్తున్నాయ్.

సాంబ : దానికేముందిలే – మహాదేవశంభో – మాగతేమైపోయినా నిన్నుమాత్రం నీలకంఠానికొక ఉత్తరం వ్రాసి అక్కడకు పంపించివేస్తాను.

సీతా : సైన్యంలో వున్నవాడిదగ్గరకువెళ్ళి నేనుమాత్రం చేసే దేముందన్నయ్యా !

సాంబ : చేసేదేముంది ! కళ్ళతోచూసి, వినే ధోరణిలోవుంటే చెప్పి తీసుకొనిరావచ్చు. అసలు చచ్చిపోయాడే అని అనుకొని నిశ్చ్వసులుకున్నవాడు ఈమధ్య వాడి పుణ్యాన ఉత్తరాలైనా వ్రాయటం మొదలెట్టాడు. అదీలేకపోతే మనకుమిగిలేది ఒకేబాధ—మహాదేవశంభో!

గోక : గద్దది గళ్ళెసెయ్యండిదొరా. అమ్మగోర్ని గాడ్కొతోలుకెళ్ళి.

సాంబ : అంతే గోకర్ణం. అంతకుమించి మనమింకా యేమీ చెయ్యలేం.

సీతా : (ఎడమకు నిష్క్రమణ)

గోక : గిప్పడా పటాలంవేడుంది దొరా ?

సాంబ : చాలాదూరం. కాశ్మీరమనే దేశంలోరా.

గోక : నా కడుపుడ్క పేరే మా చెడ్డగున్నది. కాశీర వంటేుందో. దొరా నీకాల్మొక్తా, మరి గత్తేగాణ్ణుంచే నా తిర్పతిగాడి కొడుకొత్తున్నది ?

సాంబ : అవున్రా, చిన్నప్పుడిద్దరూ కలసి పారి పోవటం పోవటం యిప్పటిదాకా కలిసే వున్నారట.

గోక : యిన్నేళ్ళసంది బెంగలేకెట్టున్నరో దొరా, నెల్దిరక్క తల్కె నాకింటిమీాద గాలారద్దిగంద. నాకడుపుడ్క.

(కుడివైపుకు మళ్ళుతూ) బేటాగాడు మాలోడు మా శెడ్డ పని శేశిండు. (నిష్క్రమణ)

[ సాంబమూర్తి ఎడమవైపుకు మళ్ళగా కుడివైపునుండి విశ్వం చేతిలో ఉత్తరం పట్టుకొని ప్రవేశిస్తాడు. ]

విశ్వం : బావదగ్గరనుంచి ఉత్తరమొచ్చింది నాన్నగారూ!

సాంబ : (సంతోషంతో గభాలున వెనక్కు తిరిగి) ఆఁ వచ్చిదంట్రా మహాదేవశంభో. అమ్మాయ్; కుసుమా! అత్తయ్యను త్వరగా రమ్మను. యేమని వ్రాశాడురా?
[ ఎడమవైపునుండి వికసిత వదనాలతో సీతారామ్మ, కుసుమ, గోకర్ణం ప్రవేశిస్తారు. ]

విశ్వం : ఎల్లుండి వస్తున్నానని వ్రాశాడు.

సీతా : నిజంగానా? నాయనా!

[కుసుమ విశ్వం దగ్గరున్న ఉత్తరాన్ని తీసుకొని ఒక ప్రక్కకు వెళ్ళి తనకళ్ళను తానే నమ్మనట్టు లోలోపల చదువుకుంటుంది.]

సాంబ : మ—హా—దే—వ—శం—భో!

గోక : (కుసుమను సమీపించి) నోరెత్తేందుండి. బిగ్గరగన రాదురి.

కుసుమ : (సిగ్గును అభినయిస్తూ ఉత్తరాన్ని గోకర్ణంచేతిలో పెట్టి తుర్రున ఎడమకు నిష్క్రమిస్తుంది.)

గోక : నాశదుపుడ్క! శిన్నమ్మ గోరికెంత కుశాలుగున్నది. (ఉత్తరాన్ని అటూయిటూ చూస్తూ సాంబమూర్తితో) దొరా జరా సదువురి.

సాంబ : వాడు నాపేరిట వ్రాయడుచా! వాళ్ళమ్మకే యివ్వు.

గోక : నీకాలోమ్మక్కా; మీకు మా శెడ్డ పట్టుదలుండె. మాత గోరికిది లాయకాక్కాదురి. (వుత్తరం సీతారామ్మ చేతికిస్తాడు.)

సీతా : (వుత్తరాన్ని అందుకుని) పూజ్యురాలైన తల్లిగారికి... నేనిప్పుడు శెలవుల్లో వున్నాను. మీఅందరినీ చూచి పోవాలనే అపేక్షచొప్పున 2వ తేదీ ఆదివారంనాటికి మనవూరు చేరుకోగలను. పన్నెండుసంవత్సరాలతర్వాత తిరిగి కలుసుకుంటున్నందుకు మీరు చాలా సంతోషిస్తారనే భావిస్తున్నాను. ఇట్లు, మీ నీలకంఠం.

సాంబ :–సంతోషిస్తావా లేదా అనే అనుమానంకూడా యెందుకురా మహాదేవశంభో! నెత్తినెక్కించుకుంటాం; నెత్తిని!

విశ్వాం: మరీ అంత నెత్తినెక్కించుకున్నా ప్రమాదమే!

సాంబ : ప్రమాదవొచ్చినప్పుడు చూద్దాంగాని; ఒరేయ్! ఇప్పటికైనా నీవు నీచెడసరితనం మాని బావతో జాగ్రత్తగావుండు తెలిసిందా? అమ్మా సీతారామ్మా– ఇంకా అలాగే నిలబడ్డావెందుకు? ఎల్లుండే ఆదివారమంటే! కానీ, అల్లుడికి నేనుకొట్టిన దెబ్బలన్నీ మరచిపోయేట్టు బ్రహ్మాండమైన స్వాగతమివ్వాలి. ఒరేయ్ గోకర్ణం! నీవు చాకలివాడిని ఉన్నపళంగా వెంటబెట్టుకొని తీసుకొచ్చి దగ్గరుండి యిల్లంతటికీ సున్నంవేయించు— ఆc......

గోక : గట్నేదొరా! (వెళ్ళబోయి వెనక్కుతిరిగి) సాకళ్ళిప్పుడేడుంటారు. రేవునుంచొచ్చినాక యెల్తలే దొరా!

సాంబ: రేవుకాడికే వెళ్ళకోయ్!

గోశ: నీకాల్మొక్తా; పోతనేవుండగండ. (కుడికి నిష్క్రమణ)

సీతా: అన్నయ్యా! ఇప్పుడు సున్నం కొట్టించటం దేనికి? పెళ్ళినాటికి యెట్లాగూ కొట్టిస్తాంగా!

సాంబ: అవునవును. అయితే యిప్పుడే పెళ్ళియేర్పాట్లుకూడా చేద్దాం.

సీతా: నీతొందరగాని; యేర్పాట్లుచేస్తే, అవుతల లగ్నా లుండొద్దూ!

సాంబ: లగ్నాలదేవుంది మహాదేవశంభో! (బిగ్గరగా) కుసుమా! ఆ ఉత్తరీయం చేతికర్ర యిట్లా పట్టుకోని రామ్మా! (సీతారామమ్మతో) ఇప్పుడే అవధాన్లుగారిని కలుసుకోని దగ్గర్లోనే ఒక శుభముహూర్తాన్ని చూడమని చెప్తాను. (కుసుమ ఉత్తరీయం, చేతికర్ర తెస్తుంది. కుసుమతో) నాబంగారుతల్లికి యింతత్వరలోనే మంచి రోజులొస్తాయని నేను కలలోకూడా అనుకోలేదు. మహాదేవశంభో! (కుడికి నిష్క్రమణ)

విశ్వం: "కళొచ్చినా కళ్యాణమొచ్చినా ఆగనట్టు' మా నాన్నకు కోపమొచ్చినా గుణంకుదిరినా ఆగదు. కానులతో కలిసి మాలకూడు తింటున్నాడని బావని ఆనాడు తాను చితకతన్ని, అటుకాసుల్కి వాడి తండ్రిచేత తన్నిచ్చాడు. అవమానాన్ని భరించలేక అత్తయ్యగారు లిద్దరూ దేశాంతరంవెళ్ళి షుంచిరిత్తే విడిపోయారు. పన్నెండేళ్ళతర్వాత అంతర్జాతీయ పౌరు

డుగా ఆబావే తిరిగి వస్తుంటే లంచంగా యివాళ కూతుర్ని చేత్తోపుచ్చుకొని నిలబడుతున్నాడు. యేం చెప్పనత్తయ్యా! మహాదేవశంభో—

సీతా: యేంచెప్పతావేఁ? కుసుమని బావకివ్వొద్దంటావేమో చెప్పు!

విశ్వం: చంపావ్; దాన్నేయివ్వండి మళ్లా నన్నెందుకు చంపుతారు! (అందరూ నవ్వుకుంటారు.) అత్తయ్యా, నేను వహించే భారమేమిటో నీకు తెలుసుగా?

సీతా: యేమిట్రా అది—

కుసుమ: నాకు తెలుసునత్తయ్యా—

సీతా: యేమిటే అది—

కుసుమ: మూడుపూటలా మూడుకంచాలు—

విశ్వం: ఆపైన వూళ్ళో గిల్లికజ్జాలు— కనుకపద! ఇప్పుడోకకంచంలేపేద్దాం (కుసుమచెయ్యిపుచ్చుకొని లాక్కెళ్ళతాడు. ఆమె వదిలించుకుంటుంది. విశ్వం యెడమవైపుకు వెళ్ళతాడు. సీతారామ్మ ఉత్తరాన్ని టేబులుమీదపెట్టి నవ్వుముఖంతో అతన్ని అనుసరిస్తుంది.)

[ కుసుమ యేకాంతంగా బావనుగూర్చిన మధురభావలతో అటూయిటూ కలయతిరిగి కూనిరాగంగా ప్రారంభించి ఉత్తరాన్ని తీసుకొని పాట పాడుతుంది. ]

తీయదనాల

తేనెసోనల

తలపుల
తలుపులు
తెరచుకొన్నవి

నా
మనసున
మమతలు
చొచ్చుకొన్నవి
ముత్తెపు సరుల
చిత్తజల్లుల
పులకల
చెణుకులు
తగులుచున్నవి

నా
తనువున
తరగలు
లేచుచున్నవి.

[ పాటఅంతంలో కుడివైపునుండి గోకర్ణం 'రయిట్, లెఫ్ట్, రయిట్, లెఫ్ట్, అంటూ ప్రవేశించి ఓల్డాన్' అని ఆగుతాడు. ]

కోనమ్మ: ఏమిటి గోకర్ణం నువ్వుకూడా సైనికుడవైపోయావ్!

గోక: మరేందనుకున్నరు. గోకరణం యింగిడుం డొచ్చినాడు. (చంకలో కర్రను ప్రేక్షకులకు గురిపెట్టి 'ఢాం' అని కేక్వేస్తూనే అరిచి పడిపోతాడు. కళ్ళు

నులుముకుంటూ లేచి) ఓరి నీకడుపుడ్క, బందూకొది ల్నాడు సానటవేంది! (కుసుమతో) అమ్మగోరో; నేంగూడ్క శిపాయిల శక్కై త్తిసి యీమాట నొక్కడుగల్నె యాదికెట్టుకోను.

కుసుమ : అదేమిటీ సైన్యంలో చేరిపోతున్నావా గోకర్ణం!

గోక : దొరోరితో శెప్పి మీతావుకి తోలికెల్లండమ్మగోరో! (ప్రాధేయపూర్వకంగా)

కుసుమ : నే నెక్కడికి వెళ్తున్నాను.!

గోక : గట్టంటరు! నీలకంటం దొర మిన్మల్ని డుత్తరేంది!

కుసుమ : ఊరుకో గోకర్ణం -- యిప్పటినుంచీ......

సాంబ : (కుడినుండి ప్రవేశం) యెప్పటినుంచోమాత్ర మెక్కడమ్మా. మీబావయ్య సరిగ్గా యీవూళ్లో అడుగు పెట్టిన నాటనుంచీ ఒక్కవారంమాత్రమే వుంటుంది.

గోక : యేం దుండది ?

సాంబ : లగ్నంరా లగ్నం! నీలకంఠం కుసుమాదేవిగార్ల వివాహం.

గోక : నా కడుపుడ్క! (నవ్వి) సీతారామ్మగోరో – (ఎడమ వైపుకి నిష్క్రమణ)

కుసుమ : భోజనానికి పద నాన్నా యిక (ఉత్తరీయం, చేతికర్ర తీసుకుంటుంది.)

సాంబ : పదమ్మా పద; మహాదేవశంభో —

[ తెర – ]

—:o:—

# రెండో దృశ్యం

[ మొదటిదృశ్యం మాదిరిగానే రంగాలంకరణ ఉంటుంది. కుసుమ కొత్తపెళ్ళికూతురులాగా ముస్తాబై బావ రాకకై ఎదురుతెన్నులు చూస్తూ మొదటిదృశ్యం చివరగల పాటను ఇక్కడ పూర్తిచేస్తుంది. ]

ఆమని వేళ
అలరు పూవుల
కులుకల
ఉలుకులు
గెంతుచున్నవి
నా
నిలువున
చెమటలు
పోయుచున్నవి.
గలగల గలల
సెలయేరులల
పరుగుల
ఉరకలు
రేగుచున్నవి
నా
బ్రతుకున
గతుకులు
తొలగుచున్నవి.

[ పాట అంతంలో యేదో అలికిడి విని చెంగున వీధి వైపుకి వెళ్ళి పరీక్షగా చూస్తుంది. యేమీ లాభం లేకపోగా విసుగ్గా యెదురుగా వైపుకు వస్తుంది. కుడివైపునుండి కృపానందం శ్రద్ధాభక్తులతో ప్రవేశించి ఒక ప్రక్కగా ఒదిగి నిలబడతాడు. ]

కృపానందం : అమ్మగారూ! నీలకంఠం బాబుగారు వచ్చేది యివాళేగా?

కుసుమ : (అభిముఖురాలై) అవునా యెందుకు?

కృపా : ఆఁ యేమీలేదు. మా అయ్య బాబుగారు రాగానే తెలుసుకొనివచ్చి చెప్పమన్నాడు.

కుసుమ : మీ అన్నయ్యకూడా వస్తానని వ్రాశాడటగా?

కృపా : వ్రాశాడుగాని యెప్పుడొచ్చేదీ యెవరికీ తెలియదు. యేరోజు కారోజు వస్తాడనే యెదురు చూస్తున్నాం.

కుసుమ : మా బావతోపాటే వస్తాడేమోలే! ఇద్దరూ ఒక చోటేగా వుండేది.

కృపా : అవును; ఆసంగతులన్నీ తెలుస్తాయనే మా అయ్య నీలకంఠంబాబు రాగానే ఇక్కడకు రావాలనుకున్నాడు.

కుసుమ : ఎట్లావుంది తిను పతికి? కాస్త లేచి తిరగ్గలుగుతున్నాడా?

కృపా : యేం తిరగటంలెండి అమ్మగారూ! నేను స్కూలుకు వెళ్ళితే యింటిని కనిపెట్టుకొని అట్లాగే కూర్చుంటాడు.

కుసుమ : ఏకోతే పాపం! ఇన్నాళ్ళకు నువ్వూ కాస్త యెదిగి వచ్చావ్. కాసులు పారిపోవటం – నిన్ను మీఅమ్మ భూమ్మీద పాకేసి చనిపోవటంతో ఒకదానికి మరొ కటి దిగులెక్కువై మీఅయ్య గుల్లయిపోయాడు. ఇప్పుడు నువ్వేం చదువుతున్నావ్?

కృపా : థర్డ్ ఫారం. నన్ను మాఅన్నయ్య బియ్యేదాకా చది వించాలని నెలనెలకూ డబ్బు పంపుతున్నాడుగా—

కుసుమ : అదృష్టవంతుడివే! (ఎద్దులు గంటని దూరంగా విని పించి నెమ్మది నెమ్మదిగా చేరువౌతుంది. కుసుమ ఆల కించి వీథిగుమ్మంలోనికి వెళ్ళిచూచి—) వచ్చేశాడు— వచ్చేశార్రా— అత్తయ్యా—బావ – (తుర్రున యెడమ వైపుకు వెళ్ళుతుంది. కృపానందం ఆటంకంలేకుండా ఒక ప్రక్కగా నిలబడివుంటాడు.)

[ తెరలో ]

విశ్వం : దిగండి బావగారూ! గోకర్ణం! సామాన్లు యింట్లో పెట్టు.

నీల : (నెత్తిన బెడ్డింగు, చేతిలో సూట్ కేసూ మోసుకుంటూ ప్రవేశించిన గోకర్ణం వెనుకగా సైనికదుస్తుల్లో ప్రవే శించి) ఇతణ్ణెక్కడ సంపాదించారు.

విశ్వం : (కెమేరా, నల్లకళ్ళద్దాలతో అట్టహాసంగా నీలకంఠం వెనుకగా ప్రవేశించి) వీడు తెలంగాణా వీరుడులెండి బావగారూ!

[గోకర్ణం ఎడమవైపున సామానులు దించుతాడు. కుసుమతోపాటు సీతారామ్మ, సాంబమూర్తి ఎడమ

నుంచి ఆతురతగా ప్రవేశిస్తారు. కుసుమ వెనక్కు తగ్గి చాలెడంత ముఖంతో బావను చూస్తూ నిలబడిపోతుంది. క్షణకాలం సాంబమూర్తి పరివారం నీలకంఠాన్ని నోళ్లు విప్పుకొని ఆశ్చర్యవదనాలతో చూస్తుంటారు. నీలకంఠం అందరినీ పరీక్షగా చూచి ఒక ప్రక్కగా నిలబడిన కృపానందంమీద దృష్టిని నిలుపుతాడు. కృపానందం కొద్దిగా చలిస్తాడు.]

సీతా : (కుమారుని వైపుకి చేతులుచాచి మాతృ సంవేదనంతో) నాయనా, నీలకంఠం!

నీల : (కృపానందం వైపునుండి తటాలున సీతారామ్మ వైపుకి దృష్టిని మరల్చి కొంత తటపటాయింపును నటిస్తాడు.)

సాంబ : (గాద్గదికంగా, నీలకంఠంతో పరిచయధోరణిలో) మీ అమ్మ నాయనా! (కన్నీరు తుడుచుకుంటాడు.)

నీల : అమ్మా! (చేతులు కొద్దిగా ముందుకు చాస్తాడు.)

సీతా : బాబూ! (నీలకంఠాన్ని కౌగలించుకుంటుంది.) ఎన్నాళ్ళకు మళ్లా నువ్వు నా కంటబడ్డావు రా తండ్రీ! (కన్నీళ్ళు) యేం పాపంచేశానని కన్నతల్లి నింత కఠినంగా శిక్షించావు నాయనా! (నీలకంఠం చెక్కిళ్ళను రెండుచేతులతోనూ నిమురుతూ అతని కళ్ళల్లోకి చూడాలని ప్రయత్నిస్తుంది. నీలకంఠం ముఖాన్ని తిప్పేసుకొని సందిగ్ధావస్థలో పడిన వాడిమోస్తరుగా విపరీతమైన బాధకు గురౌతాడు. కుసుమ దృష్టిని ఆటంకపరుస్తున్న కన్నీటిని తొలగదీస్తూ ఆ మధుర సంవేదనాపూరితమైన దృశ్యాన్ని ఉత్కంఠతతో తిలకిస్తుంది.)

సాంబ : ఏదో చేశావులే. అయిపోయింది; ఇప్పుడా గొడవంతా యెందుకు ?

గోక : దొరగా రెన్నుకుతిన్నానో బుర్ర పెట్టావని–

విశ్వ : బావగారూ; యేదీ ఒక్కఫోటో తీసుకోనివ్వండి. (తీసి) ఓకే–

సీతా : (నీలకంఠాన్ని చెయ్యి పుచ్చుకొని) బాబూ! (సాంబమూర్తిని చూపుతూ) మావయ్య–

నీల : (కృత్రిమంగా నవ్వి) గుర్తుపట్టలేక పోవటమేంటి – మావయ్యా–

సాంబ : (నీలకంఠాన్ని చేతుల్లోనికి తీసుకొని వీపు నిమురుతూ) యెంగుర్తుపట్టటమో మహాదేవశంభో! (అతని ఒడ్డూ పొడవూ ఆకారవిశేషాలు క్షణకాలం పరిశీలించి) నిన్ను చూచి యేమాత్రం గుర్తుపట్టలేకుండా వున్నాను. నిన్నా–యివాళా–సరిగ్గా ఒక్కపుష్కరం గడిచిపోయింది. ఇప్పటికీ నాకాచిన్నప్పటి నీలకంఠం కళ్లల్లో మెదుల్తాడుగాని ఈ ఆకారంలో వుంటాడని నాకేం తెలుస్తుంది!

నీల : అవును; మీరేకాదు– ఎవరూ నన్ను గుర్తుపట్టలేరు.

విశ్వ : ఆదేమిటి అలామాట్లాడతారు? నేను గుర్తుపట్టకపోతే మిమ్మల్నిక్కడికి యెలాతీసుకొచ్చాను?

నీల : మీరాసు గుర్తుపట్టింది కేవలం మిలిటరీ డ్రెస్సునే! నీలకంఠాన్ని మీరూ ఎరుగరు.

సీతా : పోనీ నువ్వైనా (విశ్వాన్ని చూపుతూ) వీణ్ణి గుర్తించావా నాయనా!

నీల : గుర్తించకపోవటమేంటమ్మా - విశ్వంగారు.

విశ్వ : ఆఁ...విశ్వంగారా! ఎంతగౌరవం, యేం కథ!

సాంబ : యేఁడ్చావులే, నోర్ముయ్!

సీతా : అన్నయ్యా! (సాంబమూర్తి ఆగిపోతాడు. నీలకంఠంతో) కుసుమ ఎంతపెద్దదైందో చూచావా నాయనా- కుసుమా! (కుసుమ సిగ్గుపడి నిష్క్రమణ)

నీల : (కుడివైపునగల కృపానందంమీద దృష్టిపడి) ఈ అబ్బాయెవరు?

గోక : తిర్పతిగాడి కొడుకులెండి దొరా-

నీల : (సంభ్రమాశ్చర్యాలతో) ఆఁ...కృపానందం...తమ్ముడు... (సమీపించబోతాడు. కృపానందం వెనక్కి తగ్గుతాడు)

విశ్వ : (నీలకంఠాన్ని సమీపించి) ఎవరి తమ్ముడు?

నీల : (హతాశుడై ఆగిపోయి) కాసులు తమ్ముడు.

విశ్వ : వాడు రాలేదే-

నీల : (తీక్షణంగా చూచి) వస్తాడు. (బాధపడతాడు)

కృపా : నీలకంఠంగారు వచ్చిందీ లేనిదీ మా నాయన కనుక్కుని రమ్మన్నాడండీ-

విశ్వ : వచ్చాడుగా- ఈయనే తెలవట్లా-

కృపా : తెలిసిందండీ. (వెళ్ళిపోతాడు)

సాంబ : సీతారామమ్మా! ఇంకా యెంతసేపని నిలబడతారు. అబ్బాయిని లోనికి తీసుకొనివెళ్ళండి. కానీయండి మహా

దేవశంభో! గోకర్ణం, సామానులు లోపలపెట్టి వేణ్ణీలవీ చూడు. (లోపలికి దారితీస్తాడు.)

సీతా : (నీలకంఠంవీపున చెయ్యివేసి లోపలకు తీసుకొని వెళు తుంది. గోకర్ణం అనుసరిస్తాడు.)

విశ్వ : (ఎడమవైపునరకూ వెళ్ళి మళ్ళా తిరిగివచ్చి) ఎంతప్రేమ! ఈగనుకూడా వాలనిచ్చేటంలేదు. (సాలోచనగా అటూ యిటూ తిరిగి)వ్యవహారమంతాచూ స్తే సాఫీగా యేమీ కనిపించటంలా. మహాదేవశంభోగారికి మనమీదవున్న ఆకాస్త చూపు తొలగిపోయినట్లే (పద్యధోరణిలో) వచ్చినవాడు ఫల్గుణుడు... కనుక మనం కొంచెం జాగ్రత్తపడాలి.

కుసుమ : (త్వరగా పద్యం యెత్తుకున్నప్పుడే ప్రవేశిస్తుంది.) నాటకం వేస్తున్నావా యేమిటన్నయ్యా! పద్యం నల గేస్తున్నావ్.

విశ్వ : అమ్మాయీ– ఇక మనంకూడా నాటకాలు వెయ్యటం ప్రారంభిస్తే 'శ్రీ' లు మిగిలుండొద్దూ–

కుసుమ : ఇప్పుడు స్త్రీల కేం కొరతొచ్చిందన్నయ్యా–

విశ్వ : స్త్రీలుకాదే మైడియర్ సిస్టర్ 'శ్రీ'లు

కుసుమ : శ్రీలేమిటన్నయ్యా ?

విశ్వ : ఓసివెర్రిదానా! నువ్వింకా చాలావెనకబడేవున్నావ్. శ్రీలంటే హితశ్రీ– మిత్రశ్రీ– కమలశ్రీ– పద్మశ్రీ– లాంటివన్నమాట! అదిసరేగాని యేమిటెకథ– ఇవాళ చాలా సంతోషంగా కనిపిస్తున్నావ్?

కుసుమ : సంతోషమేముందీ - మామూలే !

విశ్వం : ఈ విశ్వానికే టోకరా యిద్దామనుకుంటున్నావా కుసుమ్మా. వీడు మనుషుల్ని యిట్టే చూస్తే చాలు పసి గట్టేస్తాడు. బావొచ్చాడని యివాళ నీకు చాలా సంతోషంగా వుందిగదూ. చెప్పు! నీకళ్ళను నీవే నమ్మలేకుండా వున్నావుగదూ - కాళ్ళు తడబడుతున్నాయా లేదా - ఊఁ చెప్పు—

కుసుమ : (సిగ్గును అభినయిస్తూ) పో అన్నయ్యా—

విశ్వం : ఆఁ...అలా చెప్పు. భర్త కావలసినవాడు పడతికి యెదురైతే అలాగే వుంటుందమ్మా - వుంటుంది.

కుసుమ : అలాగే! భార్య కావలసినావిడ మగాడికెదురైతే—

విశ్వం : ఆ సంగతి నాకింకా అనుభవం లేదు. బావనే అడుగు.

కుసుమ : యేమడగటమో! ఆయన్ని చూస్తే అసలేమీ పట్టించుకొనే మనిషిలాగా కనిపించటం లేదు.

విశ్వం : అబ్బే! కనిపించకేంపోతాడు. కాస్త నీళ్ళు కొత్తచేసి నయ్యాంతే - వస్తా - అవతల నాకోసం ప్రజలెదురు చూస్తూ వుంటారు. (కుడికి నిష్క్రమణ.)

కుసుమ : బలే అన్నయ్యా - (కుర్చీలో కూర్చొన పోతుంది.)
[ ఎడమనుండి గోకర్ణం ప్రవేశం. కాళ్ళకు మిలిటరీ బూట్లు, నెత్తిన టోపీ తిరగమళ్ళగా పట్టుకుని వుంటాడు. 'రయిట్, లెఫ్టట్' అంటూ కుసుమను సమీపించి ఎడమచేత్తో శాల్యూట్ చేసి దింపేస్తాడు. కుసుమ నవ్వుతుంది. ]

గోక : నీవొచ్చి కూసున్నవేంది ?

కుసుమ : ఇంకెక్కడ కూసోవాలంటావ్.

గోక : గట్ల మాట్లాడ్తవేందమంటే, ఇంటాయనగందా—

కుసుమ : యేమిటాయనో సుప్పంను గోకర్ణం. ఆయన్ని చూస్తుంటే నాకేమిటో విచిత్రంగా వుంది.

గోక : గదే నాకూ విత్రంగుందమ్మగారో! గాడీ దిగింతాల్నుంచీ గట్నే వుండెట.

కుసుమ : స్టేషనుదగ్గర అసలేం జరిగిందో చెప్పు గోకర్ణం.

గోక : యేం జరుగుద్ది. గాడీ తల్కి వచ్చినవారోయింది. గిట్నే టోపెట్టుకొని నీల్కంటకం దొర దిగిండు. గసుంటగా నేనుండ. మీ అన్నయ్య నీల్కంటకం దొరని సూశి 'బావా' అన్నడు. జరాసేపు నిలువుగుస్టేసి సూశి గావున నీల్కంటకం దొర తన్నదొరని గాట్టిగా కరుసుకున్నడు. ఇంగ నేను సామానులు గట్ల నెత్తి నెట్టుకొని బయటడిన గంతె సూడు.

కుసుమ : ఇంకా ఆయన మనస్సులో మానాన్నంటే అయిష్ట ముందనుకుంటాను గోకర్ణం.

గోక : గట్టయితే నాశదుపుడ్కా తిరిగెందు కొత్తడు.

కుసుమ : అవును; అదీ నిజమే !

గోక : గదేం లేదుండే. శనా యేళ్ళయిందిగదో – జరా కొత్త గుందంతే—

[ నీలకంఠం మామూలు దుస్తుల్లో కుడినుండి ప్రవేశం. కుసుమ తప్పించుకొని వడిగా యింట్లోకి వెళ్ళిపోతుంది.

గోకర్ణం త్వరత్వరగా బూట్లు విప్పి వాటిని టోపీతో కలిపి కుడివంకన పెట్టుకొని ఎడమచేత్తో నీలకంఠానికి శాల్యూట్ చేసి నిలబడతాడు. ]

నీలకంఠం : (కొద్దిగా నవ్వి) నీపేరేమిటీ అన్నావ్ —

గోక : గోకరణం – సాబ్.

నీల : శాల్యూట్ యిక దించి మామూలుగా నిలబడు.

గోక : జరా బాసలో శెప్పండి దొరా.

నీల : (నవ్వు ముఖంతో) గెట్ డౌన్ శాల్యూట్ —

గోక : (నవ్వి శాల్యూట్ దించుతాడు.)

నీల : గోకర్ణం! ఇన్నంత బరువైన బూట్లను మొయ్యగలవా?

గోక : గీ జతొక్క లెక్కా దొరా! గిసుంటివి నూరు జతలు అలకంగ లేపుకుపోనో —

నీల : రెండు కాళ్ళకు నూరు జతలెక్కడ తొడుగుతావ్.

గోక : గట్ల మాట్లాడ్తెరు. నా కడుపుక్క గంపకెత్తి నెత్తికెత్తనో – గడ్డపంచి గత్తె తన్నుకి లేపుకెళ్ళినాడిక్క గిదా గుటేందాంట —

నీల : (నవ్వి, పరధ్యానంలోనికి వెళ్ళిపోతాడు.)

గోక : దొరా! గెట్లన్న నాగ్గూడ్క శిపాయిపనిప్పి[illegible]–

నీల : శిపాయిల్లోచేరి నువ్వేంచేస్తావ్?

గోక : ఏంపీ! సైన్యటం–దానికడుపుడ్క బందూకులో మందెట్టి గురిపెట్టి మీటనొక్కితే ఎదురుమల్ల మడుసులు పిట్టలుగత్తె కూలినట్టు కూల్రో–

నీల : నువ్వు తుపాకీకాలుస్తున్నావని యెదురుగావున్న మనుషుల్ని చూస్తూవూరుకోమనా నీవుద్దేశం!

గోక : వూరుకోక యేంశేత్తన్లే దొరా! బందూకున్నోడి మీ దత్తకేంది. గన్నిగుండెలుండొద్దూ. గీడ శనామందిని సూశిన్నె దొరా—

నీల : యేంచూశావ్ ?

గోక : గాప్పుడు మాదేశాన్కి శిపాయిలొచ్చిన్రు. శిపాయిలంటే గాళ్ళే శిపాయిలు. శేతిలో రోకలి బరాబరగ బందూకులు. నాకడుపుడ్కి ఊళ్లదిగి సనెతల్కి పురుగు లేదనుకో–

నీల : యేమయ్యారు ?

గోక : అవుతరేంది! ఉరుకులంకిచ్చుకున్రు.

నీల : ఊళ్ళోవాళ్ళచేతుల్లోకూడా అప్పుడు తుపాకులుంటే?

గోక : వుంటే యావయిద్దీ–గురెరికుండొద్దూ–

నీల : చేతిలో యేమీ లేనివాళ్ళను కాల్చటమనుకున్నావా సిపాయిలవని గోకర్ణం! పెద్దపెద్ద యుద్ధాల్లో ఎదురుగుండా తుపాకులు – మరఫిరంగులు పెట్టి కాల్చేవాళ్ళుంటారు. ఆకాశంలోనుంచి విమానాలమీద పెద్దపెద్ద బాంబుల్ని విసురుతారు. అయినప్పటికీ శిపాయి ధైర్యంగా నిలబడి యుద్ధం చెయ్యాలి. గోకర్ణం.

గోక : (చంకలోవున్న బూట్లను, టోపీని జారవిడిచి నోరు తెరచుకొని భయభ్రాంతుడై వింటూ వుంటాడు.)

నీల : (గోకర్ణం నిశ్చేష్టుడు కావటం గమనించి-) గోకర్ణం...
(గోకర్ణం పలకడు. చేతుల్తో కదుపుతాడు.)

గోక : (తెప్పరిల్లి) యేందీ! శిపాయి పనిగత్తె కట్టవే - గట్టా పనికి కుదిరి బతికొచ్చినావ్ దొర—

నీల : ఊఁ...

గోక : యెట్టా - నాకడుపుడ్కు - మా శెడ్డ సూరుడివే—

నీల : మరి నిన్ను కూడా శిపాయిల్లో చేర్పించమంటావా గోకర్ణం.

గోక : నీకాల్మొక్తా దొరా - గీడనే వడుండనీ - (క్రిందపడిన బూట్లు, టోపీ తీసుకొని త్వరగా నిష్క్రమిస్తాడు.)
[ నీలకంఠం కుర్చీలో కూర్చొని విచార సాగరంలో మునిగిపోతాడు. కుడివైపునుండి తిరపతి ప్రవేశం. సుస్తీగా వున్నా ఆతురత ఉత్సాహం కనిపిస్తుంది. ]

తిరపతి : ఎవరూ కూసున్నది ? నీలకంటం బాబేనా ?

నీల : (తిరపతినిచూచి గుర్తించి తటాలునలేచి, కొద్దిగా అతని వైపుకి మొగ్గి మళ్ళానిగ్రహించుకొని వివశుడై కన్నీరు కారుస్తాడు.)

తిరపతి : (కళ్ళు చెమ్మగిల్లతాయి. క్షణకాలం గడుస్తుంది) జరిగిందానికి యిశారపడితే లాబవేంటి నాయనా! కుర్రతనాన ముందుసూపులేకుండా మీాయిట్టవొచ్చినట్టు శేశారు. ఇక్కడ మీాకోసం పగులగొట్టుకొని సచ్చినోళ్ళు సావగామిగిల్నోళ్ళు సావుకు సిద్ధమయ్యారు

నువ్వూ నాకేసావ్వావే. యింకా కాసులు కంటబడనే లేదు. వాడూ నీకోసారి బయల్దేరలేదా బాబూ.'

నీల : (మాట్లాడలేదు)

తిర : యేంబాబూ మాట్లాడవ్.

నీల : కాసులు.....బయల్దేరాడు ...... ఇంటికొస్తాడు...

తిర:(సంతోషంతో)వస్తాండా వసేనాకాడు.వస్తాడన్నమాట.(నీల కంఠం ఆకృతిపై ధ్యానముంచి) ఎంతాళ్ళయిపోయాను. ఇప్పుడు నిన్నుల్ని కొట్టగలుగుతావా. ...కాసులు కూడా యింతాడయ్యాడా నాయనా? అమ్మయ్మకు (విచారంగా) ఆసింటే పంచప్రాణాలు. కొడుకును సూసుకునే రోజుల్లేకపోయినయ్ దానికి. ఆసు కనుపించ కుండాపోయినమర్నాడు మంచమెక్కింది. అప్పటికే కృపానందం కడుపునబడ్డాడు. కూడూ నీళ్ళూ లేకుండా కొడుకుమీద బెంగపెట్టుకొని నన్ను దిక్కులేనాణ్ణిగా సేసిపోయింది బాబూ—ఆడొత్తే సంటాణ్ణి ఆడిసేతుల్లో పెడదానని యెదురుసూత్తుండాను.

నీల : (హృదయానికి మహావెల్లువగా పొంగిపొరలిస్తున్న దుఃఖోద్వేగాన్ని భరించలేక అమ్మా అని బిగ్గరగా అరుస్తాడు. తిరపతివైపుకి మొగ్గువాకేసరికి ఎడమవైపునుంచి సీతారామ్మ చేతిలో పనివిడిచి ఆతురతగా వస్తుంది.)

సీతా : నాయనా నీలకంఠం.

నీల : (నిల్దొక్కుకొని ఆయిల్లు ఆ పరిస్థితులను స్మృతిమాత్రంగా తలంచేలోపలే సీతారామ్మ అతణ్ణి గుండెల్లో పొదువుకుంటుంది.)

తిర : (కన్నీరు వొత్తుకుంటూ, అణకువగా) సూశిపోదావని వచ్చాసండి. వుండబట్టలేక మాయింటిదాని సంగతు లత్తేసరికి బాబుగారు నిలువునా నీరయిపోయారు.

నీల : (తిరపతి దిక్కుగా తలెత్తి ఛూస్తాడు యేమీ అనడు.)

సీతా : (నీలకంఠం ముఖాన్ని ఎదురుగా తీసుకొని) ఎన్ని సంవత్సరాలుగా కన్నతల్లి మీది మమకారం గూడుకట్టుకొని వుంది బాబూ! యిన్నాళ్లా బాధను యెలా సహించావు. నేను చచ్చిపోయాననుకున్నావా? నీవొస్తావు గానే నేనూ యిక్కడ కడుపు తీపితో కంటికీ మంటికీ యేకధారగా యేడ్చాను. నా శరీరంలో శరీరమైన నువ్వు నా కౌగిలినుండి దూరమైపోయిన తర్వాత నా గుండెలు యిసుక మీటలైపోయాయి. ఎడారి జీవనమైంది నాయనా! యివాళ మళ్ళా నా శరీరంలో శరీరానివి నాసందిట్లోకి వచ్చావు. తపన చెందిన నా గుండెల్లో నీటిబుగ్గలు పొంగి పొర్లాయి. తల్లిగా చల్లబడ్డాను బాబూ – (తిరిగి కౌగలించుకుంటుంది.)

తిర : శెట్టంత కొడుకును తిరిగి సంపాయించుకున్నావు తల్లీ –

సీతా : సంపాదించుకోవా లనుకుంటే మాత్రం నావల్లే మౌతుంది తిరపతీ! వాడిమనస్సులో తిరిగి యిక్కడికి రావాలనే సంకల్పం కలిగి వుండకపోతే నేనుగాని మువ్వుగాని యెవరు మాత్రం యేం చెయ్యగలిగే వాళ్ళం. యేక్షణంలో యెవనిబుద్ధి యెటువంటి సంకల్ప వికల్పాలను ప్రేరేపించి యేవిధమైన సమస్యల్ని సృష్టిస్తుందో యెవరూ

అర్థం చేసుకోలేరు. అందరూ ఆ సమస్యలు కలిగించిన సుఖదుఃఖాలను అనుభవిస్తారు. అనుభవించక తప్పదు. నేనూ అంతే – వీడూ అంతే – మనందరమూ అంతే తిరపతీ —

నీల : (సీతారామ్మ జ్ఞానౌన్నత్యం ముందు తానొక అల్పుని గా భావించుకొని 'అమ్మా' అని ఆమె కాళ్ళను కౌగలించుకొని వలవల యేడుస్తాడు.)

సీతా : (నీలకంఠం శిరస్సున చేయి నిమురుతూ) నాయనా ప్రత్యేకించి నేనేమీ నీ బలహీనతను యెత్తి చూపలేదు. అరిషడ్వర్గాలకు సామాన్య మానవులంతా లోకువే! సౌఖ్యాన్ని కోరి శత్రుగుణాలను ఆశ్రయించిన వారికి చివరకి మిగిలేది దుఃఖమే! (భుజాలు పట్టుకొని లేపుతూ) లేతండ్రీ లే! (నీలకంఠం లేచి సిగ్గుతో యెవరి ముఖాన్ని చూడలేకపోతాడు.)

తిర : నీలకంటం బాబూ నీవొక బంగారితల్లి కడుపున పుట్టావ్. ఆ తల్లికి యింకేమీ కొరత శెయ్యొద్దు నాయనా! (కన్నీళ్లొత్తుకొని) ఎల్లొత్తానమ్మా – ఎల్లొత్తాను – (వెళతాడు.)

నీల : (సీతారామ్మను విడిచి, తిరపతి వెళ్ళిన దిక్కుగా రెండడుగులు వేసి మళ్ళా వెనక్కి తిరిగి ఉద్వేగంతో–) అమ్మా – కాసులు కేదీ తల్లీ – అతని తల్లిని అతనికి కాకుండా అన్నీ తెలిసిన మీరు మాలవాడని అవమానించి దూరం చేశారు. మానవుల గుణగణాలకు, సుఖ

దుఃఖాలకు కులభేదాలు కొలమానం కాదని గుర్తించటం కష్టమైన పనా? కాసులుకోసం అతని తండ్రీ - నీలకంఠంకోసం మీరూ పడుతున్న బాధ భేదాన్ని సూచించటం లేదే! అయినప్పుడు కాసులుకెందుకు సంఘ గౌరవం లేకుండా పోయింది? అతడు వెలివెయ్యబడ్డ కులంవాడెందుకయ్యాడు? ఎందుకా నియామాల నాతడు పాటించాలి? ఈ దౌర్జన్యం యెవరిది? ఎవరిని శిక్షించాలి? ఎవరు శిక్షిస్తారు?

సీతా : (ప్రశాంతంగా) అతనికే ఆ అధికారముంది నాయనా!

నీల : ఆం......

సీతా : అవును; అయితే అతడే, యీ ప్రశ్నలు వెయ్యగలగాలి. అసలు బాధేమిటో చెప్పగలగటం జ్ఞానం. జ్ఞానియైన వాడెప్పుడూ వున్నతాసనం మీద దేవుంటాడు.

నీల : అయితే యిప్పుడున్నతాసనంమీద వున్నవాళ్ళంతా జ్ఞానులేనా?

సీతా : కాదు. జ్ఞానోపార్జన కష్టమై పారంపర్యంగా హక్కును నిలబెట్టుకొన్న అజ్ఞానులు.

నీల : అ-జ్ఞా-ను-లు (దూరంగా శూన్యావలోకనం చేస్తాడు.)

విశ్వ : (కుడినుండి ప్రవేశం) ఇంకా బావగారు విషాదయోగంలోనే వున్నట్టున్నారు. ముహూర్తం సంగతి చెప్పక పోయారత్తయ్యా హుషారెక్కేదేమో!

సీతా : పెళ్ళికూతురు తరపువాళ్లు మీరే చెప్పండి.

నీల : (హాస్యంలోనే) ముహూర్తం – ఎవరిది ?

విశ్వ : ఎవరిదో అయితే మీతో యెందుకు చెప్పాలి.

నీల : నాకా ! ఎవరితో ?

విశ్వ : ఇంకా ఎవరితో కాడే వుందీ ! మదీయ సోదరీమణితో –

నీల : మీకేంపని లేనట్టుగా వుందే !

విశ్వ : పనిలేనినాడు పెళ్ళిళ్లు చెయ్యాడు. పిల్లితల గొరుగుతాడని శాస్త్రం.

సీతా : యేమిట్రా నీ శాస్త్రాలూ నువ్వూనూ – (నీలకంఠంతో) అదేంటి నాయనా కుసుమ పెళ్ళీడుకొచ్చి యింట్లో వుంది నువ్వు చూడలా ?

విశ్వ : అది కనపడి యేడిస్తేగా వేదయుగంనాటి ఆడది.

నీల : ఆమె కనపడనవసరమూ లేదు. మీరామెను నాకిచ్చి పెళ్ళిచెయ్యవలసిన అవుసరం అంతకంటే లేదు.

విశ్వ : మరీ మంచిది. మీరే యెక్కడికైనా తీసుకొనివెళ్ళి పెళ్ళి చేసుకోండి.

నీల : పరిహాసంగా కాదు నేను మాట్లాడేది !

విశ్వ : సీరియస్సుగానే నన్నమాటా – అయితే కురుక్షేత్ర సంగ్రామం తప్పదా ? (భుజాలెగురవేస్తూ ఎడమవైపుకి నిష్క్రమణ)

సీతా : మన్నెమిటో మనస్సులో యింకా బాధపడుతూనే వున్నావ్. నాకేమీ బోధపడటం లేదు నాయనా ?

నీల : మీరంతా నన్ను బాధపడకుండా వుండనిస్తేగా –

సాంబ : (చేతిలో కర్ర భుజాన ఉత్తరీయంతో ప్రవేశం) యేమి టమ్మాయ్ అది. కాసేపు వాణ్ణి విశ్రాంతిగా వుండ నియ్యకపోయూరా!

సీతా : దగ్గిరిలోనే పెళ్ళి ప్రయత్నం పెట్టుకొని వాడికి చెప్పక పోతే యెట్లా -

సాంబ : చెప్పటానికేముంది - అదొక పెద్దపనా!

సీతా : పెద్దపనే అయింది. అసలు వాడు పెళ్ళే చేసుకోనంటు న్నాడు. (లోనికి వెళుతుంది)

సాంబ : (నీలకంఠాన్ని సమీపించి కొద్దిగా నవ్వి) నువ్వు పారి పోయే ముందు చేసిన పెళ్ళిలాంటిది కాదులే! ఈసారి కుసుమతో కలసిన వివాహం. నీకు గాకపోతే నాకూ తుర్ని యింకెవరికిచ్చి చేస్తానాబ్బాయ్.

నీల : ఇంకెవరికిచ్చినా నా కభ్యంతరం లేదు. నాకిప్పుడు పెళ్ళి మాట తలపెట్టకండి.

సాంబ : (నిర్లక్ష్యంగా) ఇంకెప్పుడోయ్ పెళ్ళి! అన్నీ వుడిగి పోయిన తర్వాతనా? కుసుమని యింకెన్నాళ్ళని అలాగే వుంచుతాం.

నీల : అసలు నేను వస్తానో రానో తెలియనప్పుడు మీ అమ్మాయిని నాకోసమే వుంచినట్లుగా మాట్లాడతా రేమిటి? ఇప్పటికైనా మీరామెను నాకొరకేమీ పెళ్ళిచెయ్యకుండా ఆపనవుసరం లేదు. ఇంకెవరికైనా యిచ్చి వెంటనే పెళ్ళి చేసెయ్యండి.

సాంబ : ఎత్తిపొడుపు మాటలెందుకులేరోయ్ మహాదేవశంభో! నువ్వు వస్తావో రావో తెలియకపోతే మాత్రం నీకే యిచ్చి పెళ్ళి చెయ్యాలనుకోకూడదా? పిలిచి పిల్లనిస్తా నన్నప్పుడే అందలమెక్కి కూర్చోవాలేమిటి?

నీల : (ఒప్పించే ధోరణిలో) ఎత్తిపొడుపు మాటలు కాదండీ—

సాంబ : కాకపోతే మరేమిటి? పరాయివాడివిగా మాట్లాడతావ్. నిజం చెప్పవలసివస్తే అది యీ భూమ్మీదపడి నప్పుడే నీ భార్యగా పేరెట్టాం. నువ్వు మధ్యలో దేశాంతరం వెళ్లావ్. తిరిగి రాకపోతే అప్పుడేమయ్యేదో! ఇప్పుడు వచ్చావుగా — వచ్చినప్పుడు చిన్నప్పుడను కున్నట్లు చేసెయ్యటం తప్ప! లేకపోతే నామీదేమైనా కోపముందా మహాదేవశంభో —

నీల : అదేమీ కాదండీ. నేను చూస్తే మిలిటరీలో వుద్యోగం చేసేవాడిని. ఏ క్షణంలో యెటువంటి ప్రమాదాలు యెదురౌతాయో ఎవరికీ తెలియదు. దానికి తోడు భార్యా పిల్లలను కూడా ఎక్కడ వేడ్పించేదీ—

సాంబ: ఆ సంగతులన్నీ నాకూడా తెలుసులేవోయ్. మిలి టరీలో వుద్యోగం చేసేవాళ్ళంతా సన్యాసులుగానే వుంటున్నారా మహాదేవశంభో—ఆ గొడవంతా ఎందుకు కుసుమ నిన్ను తప్పితే యింకొకణ్ని పెళ్ళాడనంటోంది. ఆ సంగతన్నా గమనిస్తావా? (సమాధానంకోసం నీల కంఠం ముఖంలోనికి చూచి అతడు నిరుత్తరుడుగావటం గమనించి) మహాదేవశంభో—(కుడికి వెళతాడు)

నీల : (దిక్కు తోచనివాడిగా తిరుగుతుంటాడు. కుసుమ ఎడమ వైపుగా కాఫీతో ప్రవేశించి – కాఫీ బెంచీమీద పెట్టి ధైర్యంచేసి)

కుసుమ: బావా–

నీల: బావా– ఇదెక్కడిబావ.

కుసుమ: (కొంచెంబిగ్గరగా) బావా– (దగ్గరకొస్తుంది)

నీల : (అదేవిధంగా నిలబడివుంటాడు)

కుసుమ: బావా– (చేతిని సాచుతుంది.)

నీల : (ఆమెదిక్కుగా చూస్తాడు.)

కుసుమ: నాటకాల్లో బావలాగా చూస్తున్నావేమిటి?

నీల : ఆఁ...ఇది నాటకంకాదూ?

కుసుమ: ఎవరికి?

నీల : మనకే– (కాఫీని సమీపించి సేవిస్తుంటాడు.)

కుసుమ: మనకేం నాటకం చూచేవాళ్ళగ్గాని–

నీల : అయితే యెవరూ చూట్టంలేదంటావ్.

కుసుమ: చూట్టానికిదేమైనా నాటకమైతేగా–

నీల : నీకు తెలియదుగాని యిది నాటకమే! నాటకంగాకపోతే పన్నెండు సంవత్సరాల తర్వాత నేనొకందుకు తిరిగివస్తే యిక్కడంతా నాటకమే ఆడవలసి వస్తోంది.

కుసుమ: మీరనే మాటలు నాకేమీ అర్థంకావటంలేదు.

నీల : అసలు నాకర్థమౌతుంటేగా నీకు కాకపోవటానికి–వున్నట్టుండి హఠాత్తుగా నాటకంలో వేషం వేసినట్లు యిప్పు

డిప్పుడే మీ నాన్న నన్ను పెళ్ళికొడుకు వేషం వెయ్యమని ఆదేశించి పోయాడు.

కుసు : అదేమంత పెద్ద కష్టమైన వేషంకాదే! పెళ్ళికూతురు వేషాన్ని మిమ్మల్ని వెయ్యమంటే కష్టంగాని. మా నాన్న యెవరికి యే వేషం ఇయ్యాలో గట్టిగా ఆలోచించే యిచ్చాడు.

నీల : పెళ్ళికూతురు వేషానికి సిద్ధమైనవాళ్ళెవరో!

కుసు : అదీ తెలియదల్లేవుంది పాపం!

నీల : అయితే నువ్వు చాలా చిక్కుల్లో పడాల్సివస్తుంది.

కుసు : మీకులేని చిక్కులు ప్రత్యేకించి నాకేమీ రావు.

నీల : అవును; ఇద్దరం చిక్కుల్లో పడాల్సివస్తుంది. నా మాట విని యింకొకర్ని వివాహమాడు. ఎవరికి చిక్కులు లేకుండా పోతాయి.

కుసు : (యేడుస్తూ బాధగా) బావా మీరు నన్ను పరీక్షచేస్తున్నారా? నా చిన్నప్పటినుంచి మీరు కనపడకుండా పోయినా మీకు భార్యగానే నే నసలు జన్మించాను మీరు తిరిగి రావాలని అహోరాత్రాలు తపస్సుచేశాను. నా తపస్సు ఫలించి నేడు మీరు తిరిగి వచ్చారు. మీలో సగభాగమైపోయిన నన్ను వేరుచెయ్యాలని చూస్తున్నారా బావా—

నీల : ఆఁ...నాలో సగభాగమయ్యావా?

కుసు : అవునుబావా – ఆడదానికంతకంటే కోరదగిందేముంది చెప్పాళి ఆ యేంటికాయేండు పైబడుతున్నకొద్దీ మిమ్మల్ని

గురించిన ఆలోచనల్లో నాలోసగభాగం అంతర్థాన మౌతూవచ్చింది. ఆభాగాన్ని యివేళ మీలో చూడ గలిగాను. ఏ కారణం చేతనో మీనుండి నన్ను కోసి పారెయ్యాలని చూస్తున్న మీప్రయత్నం నాకెంతగానో బాధకలిగిస్తోంది. మీకూ అంతబాధ కలగటానికిబదులు నిర్లక్ష్యంగా ప్రవర్తిస్తున్నారు. ఎందుకు మీకీనిర్దయ బావా?

సీల : నిర్దయా!

కుసు : అవును; నిర్దయే! కాకపోతే ఎందుకు మీరు నన్ను వేరు చెయ్యాలనిచూస్తారు?

నీల : మీ కుటుంబమంతా నామీద ఇంతగా ఆశలు పెట్టు కున్నారని నాకేం తెలుసు. నాకు తెలియకుండానే నన్ను మీరంతా పంచేసుకున్నారు. నన్ను మిగలనివ్వకుండా చేశారు. నేనివ్వాళ్ళెట్లా నన్ను కూడదీసుకోగల్గుతాను. ఎందుకు మీరిట్లా చేశారు.

కుసు : ప్రేమభావమే అలాచేసింది బావా—

నీల : అవును. ప్రేమభావమే! అందుకు ప్రతిగా మీ కెవ్వ రికీ నే నన్యాయం చెయ్యలేను.

కుసు : ప్రేమను స్వీకరించటం అన్యాయమా?

నీల : తొందరబడబోకు నన్ను మీరంతాకలసి అనవసరపు చిక్కుల్లో దించుతున్నారు. వెనకా ముందూ ఆలోచించ కుండా నీకు తాళిగట్టి నీజీవితాన్ని నవ్వులపాలు చెయ్యాలని నావుద్దేశంకాదు. జీవితంలో తేలిస్తే తెలి

యకో వేసిన ఒక తప్పటడుగువల్ల యెన్నెన్ని ఘోర పరిణామాలను ఎదుర్కోవలసి వస్తున్నదో అనుభవిస్తు న్నవాడికి తెలుసు. నువ్వెందుకు ఆవిషవలయంలో చిక్కుకుంటావ్. నామాటవిను. నన్నిక్కడనుండి దాటి పోనివ్వండి. (కుడివైపుకి వెళ్లబోతాడు.)

కుసు : బావా! (మోకరించి, ప్రాధేయపూర్వకంగా) నన్ను న్యాయంచెయ్యకు. నీఉద్యోగం యెటువంటిదైనా:నువ్వె టువంటి పరిస్థితుల్లో వున్నా నిన్ను నేను సేవించటంతప్ప ఈ జీవితంలో నా కింకో ఆశలేదు. నా ఆశలు గంగ పాలు చెయ్యకు బావా! (ఏడుస్తుంది. నీలకంఠం నిరుత్తరుడై తలను చేత్తో పట్టుకొని కుడికి నిష్క్రమణ. కుసుమ లేచి ఒక కుర్చీలో కూర్చొని వెక్కివెక్కి యేడుస్తుంటుంది. ఇంట్లోనుంచి విశ్వం ప్రవేశిస్తాడు)-

విశ్వం : అమ్మాయ్ కుసుమ్మా! నిన్నే యిటుచూడు. యేమి టట్లా యేడుస్తున్నావ్?

కుసు : (ఇంకా యేడుపును అధికం చేస్తుంది)

విశ్వ : అరరెరె! ఏమిటి? యేంజరిగిందో చెప్పు? అట్లా యేడిస్తే నాకేం అర్థమౌతుంది? ఊఁ... చెప్పమ్మా; చెప్పు?

కుసు : (ఏడుపును తగ్గించి) యేమీ లేదులే అన్నయ్యా!

విశ్వ : యేమీలేదూ! ఏమీలేనిదానికేనా యింతేడుపు? ఇప్పటికి యేమీ లేకపోయినా ముందుముందు జరగ బోయే దానికూడా ఆడవాళ్లు యేడవగలరు. గనుక

ఆ జరగబోయే ప్రమాదాన్ని గురించయినా నా చెవిని పడెయ్—

కుసు : యేం చెప్పిమాత్రం యేం ప్రయోజనంలే అన్నయ్యా!

విశ్వ : ఇదిగో కుసుమా! నువ్వుకూడా నన్ను నాన్నమోస్త రుగా నట్టి అసమర్థుణ్నుకుంటున్నావేమో! ఒకటి రెండు సార్లు పరీక్షల్లో తప్పినంతమాత్రంచేత మనిషన్నవాడెవడూ పనికిరాడని యేపుస్తకంలోనూ వ్రాసిపెట్టిలేదు. అసలు గొప్పవాళ్ళయినవాళ్ళంతా పరీక్షల్లో బోల్తాలు కొట్టినవాళ్ళే! నేనూ గొప్పవాణ్ణి కావటానికి రోజులు దగ్గరికొచ్చాయి. ఈపాటికే నేనన్నో అద్భుతాలు చేసి చూపించేవాణ్ణి గాని ఇనప్పెట్టె తాళంచెవి మన చేతుల్లోకి రాక లేటయిపోయింది. ఆ లేటులేటు యిక నట్టి దయ్యో సూచనలు నిన్నా యివాళా ఇంకా యెక్కువగానే కనిపిస్తున్నాయి. అయినా నే నేమైనా కంటతడి పెడుతున్నానేమో చూడు. లేదు. ఉక్కుపిండంలా వున్నాను. నా సహోదరివి నువ్వుకూడా అట్లాగే వుండాలమ్మాయ్.

కుసు : మగాడివి నువ్వెలాగైనా వుండగలుగుతావ్. నీతో నాకు వంతెట్లా కుదురుతుందన్నయ్యా—

విశ్వం: మగాడేమిటి; ఆడదేమిటి! మన రాజ్యాంగంలో అట్లాంటి భేదాలేమీ లేవు. పిల్లల్ని కనము అని ఆడవాళ్ళన్నా, ఆ పని మేం చేస్తాం అని మగాళ్ళన్నా ఎవరూ అభ్యంతరం పెట్టేవాళ్ళుండరు.

కుసు : అభ్యంతరం పెట్టేవాళ్ళు లేనంతమాత్రంచేత ఆడది తన సహజ ధర్మాలను వదులుకుంటుందా? మగాడితో పోటీ ఆడదానికి కుదరదన్నయ్యా—

విశ్వం: పిరికిపందలుగా తయారైపోయిన మీ స్త్రీజాతిని బాగు చెయ్యటం చాలా కష్టం. అయినా ఆపటేసి వూరుకో కూడదు. నీ కన్నీటికి కారణం చెప్పు?

కుసు : కన్నీటికి కారణం హృదయముండటమే!

విశ్వం : హృదయాలందరికీ వుంటాయి. కన్నీరు కేవలం పిరికి హృదయంగలవారికే! ధైర్యంతో సమస్యల్ని యెదు ర్కోటం నేర్చుకోవాలిగాని దిగాలుపడి కూర్చుంటే వొరిగేదేమీ వుండదు కుసూ.

కుసు : ఆడదానికి ధైర్యం విషయంలో ఒకరు చెప్పనవసరం లేదన్నయ్యా! దాని అవసరం పడినప్పుడు ఆడదే ధైర్యానికి మారుపేరవుతుంది. తనను తాను సమర్పించు కొనే ధైర్యమే ధైర్యం. అటువంటి ధైర్యాన్ని నువ్వు స్త్రీ జాతిలోనే చూడగలవ్. అందాకా ఆడది మంచు గడ్డలా కరిగి పోక తప్పదు.

విశ్వం : కరిగి నీరైపోయేముందు కదిలి చెప్పేదేమైనా వుందా?

కుసు : వుంది—

విశ్వం : ఏమిటదీ!

కుసు : ఏముంటుందీ; నావివాహం సంగతే!

విశ్వం : అసయ్యా: చంపావుగదే! దీనికేనా యింత రాద్ధాంతం. ఒకప్రక్కన పెళ్ళియేర్పాట్లు జరుగుతూనే వున్నాయిగా—

కుసు : యేర్పాట్లు జరిగితే లాభమేమిటి? అసలుమనిషికి చీకుకుట్టేట్టుకూడా లేదు.

విశ్వం : ఏమిటీ! నువ్వడిగితేకూడా పెళ్ళి వద్దనే అంటున్నాడా?

కుసు : అవును—

విశ్వం : వింతగానేవుందే! బావగారింత మొండికెయ్యటానికి యేదో పెద్దకారణమే వుండివుంటుంది. అందుకు నువ్వే యేటుం దేనికి? ఇదేనా ఆపద కరిగి పోవటమంటే!

కుసు : అవును; ఇక్కడనుంచే ప్రారంభమౌతుంది.

విశ్వం : చచ్చాం. అయితే నువ్వింకేమీ మిగలవు.

కుసు : అదే నాక్కావాలి.

విశ్వం : ఆఁ... ఎంతధైర్యం! అట్లా జరగటానికి వీల్లేదు. బావొద్దంటే యిక సిపెళ్ళే చెయ్యలేమా? ఇదేలగ్నానికి ఆయన తాతలాంటివాణ్ణొకణ్ణి తీసుకొచ్చి నీకు మూడుముళ్ళూ వేయించేస్తాం.

కుసు : (గట్టిగా) అన్నయ్యా – ఏమిటామాటలు? నీకు చేతనైంది నువ్వు చేస్తానంటున్నావుగాని నా మనస్సేమిటో అర్థంచేసుకోలేక పోతున్నావ్. (ఏడుస్తుంది)

విశ్వం : అరెరెరె! మళ్ళా ప్రారంభించావ్. ఇకనాచేతగాదు. అత్తయ్యా.

సీతా : (ప్రవేశించి) ఏమిట్రా విశ్వం? ఎందుకు దాన్నేడిపిస్తావు?

విశ్వం : అమ్మమ్మా! ఆపని నాది కాదత్తయ్యా.

సీతా : మరెందుకు యేడుస్తుంది?

విశ్వం : అదే నా కర్థం కాదటు!

సీతా : అమ్మా కుసుమా! యేమిటి నాతో చెప్పు!

విశ్వం: అంత పెద్ద విషయం కాదులే అత్తయ్యా - బావ పెళ్ళాడనంటున్నాడనీ—

సీతా : అవును; అదే నాకూ విచారంగావుంది. అమ్మా యిటు చూడమ్మా-నిష్ఠురంచేసుకోనటం నా కేమంత కష్టమైన పనిగాదు. నా కొడుగ్గా నీలకంఠం నీ కేమీ అపకారం చెయ్యనివ్వను. [కుసుమ పూరడిల్లుతుంది. విశ్వం కుడి వైపుకి, కుసుమను తీసుకొని సీతారామమ్మ ఎడమవైపుకి నిష్క్రమిస్తారు.]

[ తెర ]

# మూడో దృశ్యం

—:o:—

[శిరపతియిల్లు. కుడివైపున ఒకమంచం లేవనెత్తి వుంటుంది. ఎడమవైపున ఒకపెద్ద దేవదారుచెక్కలపెట్టె, దాని మీద కొన్ని పుస్తకాలు, దానికెదురుగా ఒక ముక్కాలి పీటా వుంటుంది. పెట్టెలో గుడ్డలు, మందు, యితరవస్తువులతోపాటు కొన్ని వుత్తరాలు పెట్టి వుండాలి. గోడకు యేసుక్రీస్తు పటం వ్రేలాడగట్టబడి వుంటుంది.]

తెరపైకి పోతుంది.

శిర : (కుడివైపుగా ప్రవేశించి ఒక మూలగా చెప్పులు విడిచి సరాసరి యెడమవైపుకు నిష్క్రమిస్తాడు. వెంటనే ఒక గ్లాసుడు మంచినీళ్ళతో ప్రవేశించి పెట్టె తెరచి మందు పొట్లంతీసుకుంటాడు. మందునుగొంతులో వేసుకొని మంచినీళ్ళు తాగుతాడు. ఆ మీదట గ్లాసును ఎడమవైపు లోపల పెట్టి మూతితుడుచుకుంటూ ప్రవేశిస్తాడు. కుడి వైపుగా చంకన పుస్తకాల సంచి తగిలించుకొని త్వర త్వరగా కృపానందం ప్రవేశం.)

కృపా : (గబగబా తండ్రిని సమీపించి చేతులు పుచ్చుకొని) నాయనా అడిగొచ్చావా? అన్నయ్యొస్తాడంటనా?

శిర : నాశిట్టి తండ్రికి బళ్ళోకెళ్ళినా యావంతా అన్నయ్య మీదే – ఇంకా సమవెప్పాడో!

కృపా: చదుకోగిదు' అన్నయ్యసంగతిచెప్పు నాయనాముందు.

శిర : వస్తాడంటలే నాయనా—

కృపా : ఆఁ... వస్తాడా! అన్నయ్యొచ్చేస్తాడు. అన్నయ్యొచ్చేస్తాడు. (తిరపతివెంకమ్మచేతులూ పట్టుకొని గుక్క తిరక్కుండా గిరగిరా తిప్పుతాడు)

తిర: (భరించలేక దగ్గటం ప్రారంభిస్తాడు)

కృపా : (తిరగటం ఆపి) నాయనా నాయనా – (పరుగున వెళ్ళి మంచం వాల్చి తండ్రిని కూర్చోబెట్టి ఎదురువైపుకు పరుగున వెళ్ళి మంచినీళ్లు తెచ్చి తండ్రికి తాగిస్తాడు.)

తిర : అమ్మయ్య – (సేద తీర్చుకుంటాడు)

కృపా : అట్లా అయిపోయావే నాయనా ?

తిర : (ధైర్యంగా) ఏమీ లేదులే నాయనా! బాగానేవున్నాగా–

కృపా : (కొద్దిగా విచారంగా) యేంబాగో! నువ్వు రోజు రోజుకి లేవలేకుండా అయిపోతున్నావ్.

తిర : ఇంకేంభయంలేదులే బాబూ. రేపోమాపో మీ అన్న యొస్తాడు ఇక మనకేం కట్టాలుండవు.

కృపా : (సంతోషంతో చూపుడు వేలును తండ్రివైపు నాట్యం చేయిస్తూ) అన్నయ్యొచ్చేస్తాడు. అన్నయ్యొచ్చేస్తాడు.

[పాట]

నాన్నా నాన్నా అన్నయ్య
ఎన్నాళ్ళయిందో నయ్య
రేపో మాపో వస్తాడు
చూపుల పండుగ చేస్తాడు
ఆపదలేవీ రాకుండా

దాపుగ వుంటాడింకెప్పుడు
కోపాలెప్పుడు పడకుండ
కాపాడింకా పోకుండా

(చివరికి చప్పట్లు కొట్టుకుంటూ బాల విన్యాసంతో ఆనందోత్సవాన్ని ప్రదర్శిస్తారు.)

తిర : (ఆనందంలో పైపైట చరచి ఆనంద బాష్పాలను తుడుచుకుంటాడు.)

కృపా : (ఏసుక్రీస్తు పటం దగ్గరికి వెళ్ళి నొసటను భుజాలను అద్దుకొని తండ్రిదగ్గరకు వస్తాడు.) అదేంటి నాయనా కన్నీళ్ళెట్టుకుంటావ్ ?

తిర : సంతోసం పట్టలేక బాబూ !

కృపా : ఇంతకీ నేను చెప్పినట్టు అన్నయ్య నింకెప్పుడూ కొప్పడకూడదు తెలిసిందా ?

తిర : ఆట్టాంటి పిచ్చిపని యింకెందుకు శేత్తానురా...ఆరోజు సాంబయ్యగారు నన్ను పిలిచి 'కాసులుగాడు మావాడితో తిరిగిన జాడ కనపడితే జాగర్త' అని బెదిరిచ్చాడు. ఆయన సూత్తే కులానికి కులవేగాకుండా వూళ్ళో కూడా పెద్దమనిశి. తెల్లారిలేత్తే ఆయన పాదాల కాడ బతకాలి. నాకు శీవలు - జెర్రులు పాకినట్టయి ఈ పాడు శేతుల్తో నా బంగారి తండిని రకతంకారేదికూడా సూడకుండా కొట్టా. శింతబరికె దెబ్బలికి మొడమీాద శరమం శిట్టి "అమ్మా" అని అరిశాడు. అంతలో మీా అమ్మ పొలాన్నుంచి వచ్చింది. అంతే! అదేశిట్ట

కృపా : ఆఁ... [illegible] ! అన్న [illegible] అన్నయ్యొచ్చే స్తాడు. ([illegible] తిర [illegible])

తిర: (భరించలేక దగ్గటం ప్రారంభిస్తాడు)

కృపా : (తిరగటం ఆపి) నాయనా నాయనా – (పరుగున వెళ్ళి మంచం వాల్చి తండ్రిని కూర్చోబెట్టి ఎదురువైపుకు పరుగున వెళ్ళి వంచిన నీళ్ళు తండ్రికి తాగిస్తాడు.)

తిర : అమ్మయ్య – (సేద తీర్చుకుంటాడు)

కృపా : అట్లా అయిపోయావే నాయనా ?

తిర : (ధైర్యంగా) ఏమీ లేదులే నాయనా! బాగానే వున్నాగా–

కృపా : (కొద్దిగా విచారంగా) ఏంబాగో! నువ్వు రోజు రోజుకి లేవలేకుండా అయిపోతున్నావ్.

తిర : ఇంకేం భయంలేదులే నాయనా. రేపో మాపో మీ అన్న యొస్తాడు ఇక మనకేం కష్టాలుండవు.

కృపా : (సంతోషంతో చూపులు [illegible] తండ్రివైపు నాట్యం చేయిస్తూ) అన్నయొచ్చేస్తాడు. అన్నయొచ్చేస్తాడు.

[పాట]

నాన్నా నాన్నా అన్నయ్య
ఎన్నాళ్ళయిందో నయ్య
రేపో మాపో వస్తాడు
చూపుల పండుగ చేస్తాడు
ఆపదలేవీ రాకుండా

దాపుగ వుంటాడింకెపుడు
కోపాలెప్పుడు పడకుండ
కాపాడింకా పోకుండా

(చిటికె చప్పట్లు కొట్టుకుంటూ బాల విన్యాసంతో ఆనందోత్సవాన్ని ప్రదర్శిస్తాడు.)

తిర : (ఆనందంలో మైమరచి ఆనంద బాష్పాలను తుడుచు కుంటాడు.)

కృపా : (ఏసుక్రీస్తు పటంపగ్గరికి వెళ్ళి నొసటను భుజాలను అద్దుకొని తండ్రిదగ్గరకు వస్తాడు.) అదేంటి నాయనా కన్నీళ్ళెట్టుకుంటావ్ ?

తిర : సంతోసం పట్టలేక బాబూ !

కృపా : ఇంతకీ నేను చెప్పినట్టు అన్నయ్య నింకెప్పుడూ కోప్పడ గూడదు తెలిసిందా ?

తిర : జట్టాంటి పిచ్చిపని యింకెందుకు శేత్తానురా...ఆరోజు సాంబయ్యగారు నన్ను పిలిచి 'కాసులుగాడు మావాడితో తిరిగిన జాడ కనపడితే జాగర్త' అని బెదిరిచ్చాడు. ఆయన సూత్తే కులానికి కులవేగాకుండా వూళ్ళోకూడా పెద్దమనిశి. తెల్లారిలేత్తే ఆయన పాదాల కాడ బతకాలి. నాకు శీవలు – జెర్రులు పాకినట్టయి ఈ పాడు శేతుల్తో నా బంగారి తండిని రకతంకారేది కూడా సూడకుండా కొట్టా. శింతబరికె దెబ్బలికి మెడ మీాద శరమం శిట్టి "అమ్మా" అని అరిశాడు. అంతలో మీా అమ్మ పొలాన్నుంచి వచ్చింది. అంతే ! అదేశిట్ట

శివర నా బంగారు కాసులు ముఖం సూట్టం. శీకటిపడే దాకా వున్నట్టుండి ఆకేశికి కేశ్రే మాయమయ్యాడు. తెల్లారింతర్వాత నీలకంటాన్ని మెతుక్కుంటూ సాంబయ్యగారొచ్చారు. ఇద్దరూ కలిసేపోయారు ఎవరికిశాత నైనట్టు వాళ్ళం ఊళ్ళన్నీ గాలిచ్చాం. శివరికసలు ఆశొదులుకున్నాంగా తండ్రీ.

కృపా: మొత్తంమీద భలేధైర్యంగలవాళ్ళనాయినా యిద్దరూ.

తిర : ఎంత దయిర్యం కలోళ్ళయితే మాత్రం కన్నతండ్రి శేసిన శిన్నతప్పుకు యింత పెద్ద శిచ్చా నాయినా!

కృపా : ఆ చిన్నవయస్సులో అన్నయ్య నిన్ను శిక్షించాలని ఆపనిచేశాడా ?

తిర : బొత్తిగా శిన్నతనం మాత్రమెక్కుడ. నీ యీడుండి నీలెక్క యిద్దరూ ఒకటేగలాసు సదువుకుంటున్నారు.

కృపా : నీలకంఠంగారు కూడా మా బళ్ళోనేనా ?

తిర : లేదుబాబూ! పక్కనే వయిదేటు బళ్ళోయేశారాయన్ని,

కృపా : అవునులే! మాలవాళ్ళతో మేనల్లుణ్ణి సాంబమూర్తిగారు కలవనివ్వడుగా అందుకే మనం క్రయిస్తువుల మయ్యాం.

తిర : ఏదైనా మన్ని ముట్టరానితనం యిడిశిపెట్టిందా ? మనందరం యీమాతం పుచ్చుకోటంవల్ల తెల్లదొర్లు కూడా మా లోళ్ళయిపోయారు. కాకపోతే కాత్తంత పిల్లలికి సదువూ వంద్యా దొరుకుతాంది.

కృపా : అదిసరేగాని నాయనా ! అన్నయ్యిప్పుడు నీలకంటం గారంతవుంటాడా ?

తిర : వుండకేపూతాడు బాబూ. శిన్నప్పుడు కూడా యిద్దరిదీ ఒకటే పుటక. ఒకటే రూపురేకలు కూడాను.

కృపా : మిలిటరీ డ్రస్సులో నీలకంఠంగారు యెట్లా కన్పిస్తున్నా డనుకున్నావు నాయనా. నేనక్కడే చాలాసేపు నిలబడి చూచాను. నన్ను చూచి ఈ అబ్బాయెవరని అడిగాడు. తిరుపతి కొడుకని చెప్పేసరికి నావైపుకి ప్రేమగా చూచి 'కాసులు తమ్ముడు – కృపానందం' అని పేరెత్తి పిలిచాడు. అన్నయ్య నాసంగతి నీలకంఠంగారితో చెప్పాడు గావును నాయనా ?

తిర : శెప్పకుండా వుంటాడా బాబూ నీలకంటంగారికి శిన్నప్పాటే ల్నుంచి మన కుటుంబనంటే యెంతో యిది.

కృపా : (కుడివైపు చూచి) నాయనా నీలకంఠంగారు మనింటికి వస్తున్నారు.

తిరప : ఆఁ...(ఆవైపుకు చూస్తాడు.)

నీల : (ప్రవేశం. చేతిలో పాకెట్ వుంటుంది.) తమ్ముడూ కృపానందం – (పాకెట్టును అందించబోతాడు.)

కృపా : (సందేహిస్తాడు)

తిర : పుచ్చుకో బాబూ –

కృపా : (పుచ్చుకుంటాడు)

తిర : ఈయన నీకింకో అన్నయ్య. కాసుల్తో సమానమైనవాడు.

నీల : (ఉద్వేగాన్నై) కాసులుతో సమానమైనవాణ్ణి కాదు నాన్నా నేనే కాసుల్ని నీ కుమారుణ్ణి. (కాళ్ళమీద పడతాడు)

తిర : ఆఁ...కాసులా (మెడ పరీక్షించి అక్కడ మచ్చపడిన గాయాన్ని గుర్తించి) అవును కాసులే! కాసులే! (లేపి ముఖాన్ని పరీక్షించి) కొడుకా! (గట్టిగా కౌగ లించుకుంటాడు.)

కృపా : (చేతిలో పాకెట్టును వదిలేసి) అన్నయ్యా - (నీల కంఠాన్ని అలుముకుంటాడు.)

నీల : తమ్ముడూ - (కృపానందాన్ని కౌగలించుకొని వీపు నిమురుతూ) నేనే నీ అన్నయ్యను బాబూ - (విచా రంగా)' నా మూలంగా భూమ్మీదపడ్డ దగ్గర్నుంచీ నీకు తల్లి కరువై పోయింది. పురిటిలో నలుసును పెంచి పెద్ద చెయ్యటానికి నాన్న అష్టకష్టాలు అనుభవించాడు. కాని - కాని...(మాట పెగలదు)

తిర : ఏమిటీ యిశ్చిత్రం. నీలకంఠంబాబు కూడా అచ్చం నీలాగే వుండాడు నాయినా -

నీల : (కృపానందాన్ని వదలి) నాన్నా! నన్ను క్షమించు. (తండ్రిని కౌగలించుకుంటాడు.) నేనే సాంబమూర్తి గారింటికి నీలకంఠంగా వచ్చాను. నీలకంఠం అనేవాడస లింకా లేడు నాన్నా —

తిర : (కౌగలి వదలి) ఆఁ...యేమైపోయాడు.

నీల : ఆ విషయమే నీకూ చెబుతామని వచ్చాను. ఇద్దరమూ మిలిటరీలో చేరిన తర్వాత యుద్ధభూమిలో నీలకంఠం

వెంటనే మరణించాడు. అనేక సంవత్సరాలపాటు ఆచిన్న వయస్సులో ఒకరికితోడుగా మరొకరం దేశ దేశాలు తిరిగాం. చెయ్యరాని నికృష్టమైన పనులెన్నో చేసి జీవించాం. చివరికి నా ప్రాణస్నేహితుడు నన్ను యేకాకిగాచేసి వెళ్ళిపోయాడు.

అంటరాని వాణ్ణయిన నాతో స్నేహాన్ని ఎన్ని అవ రోధాలు వచ్చినా మానక నాకు తోడునీడగా నిలబడిన అతని మరణం నా హృదయాన్ని గాయపరచింది. ఏ అంటరానితనమనే ఘోరపిశాచం నా ప్రియమిత్రుని పాలిట మృత్యుదేవతగా వెంటాడి కబళించిందో ఆ అంట రానితనాన్ని శాసనరూపంలో అనుసరిస్తున్న సమాజం మీద ముఖ్యంగా సాంబమూర్తిమీద పగ సాధించా లనే పట్టుదల నాలో కలిగింది. తనలోవున్న యే మానవగుణాలు నాలో లేవని అసహ్యించుకొని, నన్ను తన మేనల్లునితో కలసి స్నేహం చెయ్యకూడదని ఆంక్ష విధించాడో – ఆ మానవగుణాలు నీలో నాలో సమంగానే వున్నాయని సాంబమూర్తికి చాటి చెప్పా లనుకున్నాను...అప్పుడే నా ప్రాణస్నేహితుని ఆత్మకు శాంతి లభిస్తుందనే విశ్వాసం కూడా నాకు కలిగింది.

వీటన్నిటికీ తోడు నా జీవనయదార్థ దృశ్యాలు నన్ను కలచి వెయ్యసాగినయ్. ఈ పూరొచ్చి నాకుటుంబంతో కలసి వుండాలని భావించినప్పుడల్లా ఇక్కడ సమా జంలో మాలవాణ్ణిగా ఊరివెలుపల మురికి కూపంలో

నీచాతినీచంగా చూడబడటం నా వ్యక్తిత్వానికే ఘోర అవమానమై ఎదురు నిలచేది. ఎలాగైనా నా జన్మ హక్కయిన సామాజిక ప్రతిష్ఠను సంపాదించుకోవా లనుకున్నాను. మిత్రుని మరణం అందుకు నాకోమార్గం చూపించింది. ఆనాటినుంచే ఉత్తరాలు వ్రాయటం ప్రారంభించి నీలకంఠం పేరుతో అతని మాతృమూర్తికి కూడా ఉత్తరాలు వ్రాయటం ప్రారంభించాను.

ఈ పద్ధతిలో నీలకంఠంస్థానాన్ని నేనుపొంది అప్రతిష్టా కరమైన కాసులు మాలబ్రతుకును అరితం చెయ్యా లనుకున్నాను. ఈ విషయం నీకు రహస్యంగా చెప్పి అటు అన్ని హంగులూ గలవానిగా జీవిస్తూ ఇటు నీకు కుమారునిగా కూడా సంతృప్తిని కలిగిద్దామనుకున్నాను. ఆ ప్రకారంగానే సాంబమూర్తి గుమ్మంలో అడుగుపెట్టి ఆ మహాసాధ్వి ప్రియపుత్రునిగా ప్రకటించబడ్డాను.

నీచమైనకులమనే బాధాకే నన్నీపని చేయించింది నాన్నా. జన్మహక్కును సాధించుకోటానికి నాకు వేరే మార్గమేముంది చెప్పు నాన్నా ?

తిర : నీచమైన కులమనే బాధా ?

నీల : అవును; నాన్నా !

తిర : ఆ బాదని తప్పించుకుంటానికే యీ పని శేశావా?

నీల : అంతే నాన్నా !

తిరప : ఇదేనా అక్కుల్ని సాదిచ్చుకునే మార్గం ?

నీల : అంతేగా నాన్నా —

తిర : ( ముఖం తిప్పేసుకుని కోపంగా ) శ్రీ నీశుడా ! ఇట్టాంటి పాపు గుణాలు మనలో వుండయ్యేగనకనే మాల ముండా కొడుకులుగా బతకమన్నారు. నీ శేషితునితో నువ్వొసానక, సిగ్గులేకుండా ఆ బాబుగారి తల్లిని మోసగిచ్చే బుద్ధి నీగ్గనకసరిపోయింది. ఎంతపాడు పని శేశావురా – నాకొడుకివిగా పుట్టి బతుకంతా యేడిపిచ్చింది సాలక నా కళ్ళనుండే ఒక గొప్పయింటో బందిపోటుకు దిగావా ? అంతకంటే అడుక్కు తింటే నేను సూశి సంతోశిచ్చేవాణ్ణి. సచ్చుంటే కూడాఒక్కసారి యేడిసి వూరుకునేవాణ్ణి. నా కడుపు రగిలిపోతాంది...కళ్లల్లో వత్తులేసుకుని నేనూ, నా కొడుకూ నీకోసంయెదురు సూశిందిందుకేనా ? యీ పాపం నేను సూడకుండా దాంతోపాటే సచ్చినా పీడయిరగడయ్యేది. ఓరి బగమంతుడా ! యెక్కడుండావ్ ? ఎందుకు నాకీ మొండి బతుకు?(దగ్గు తెర) ఎందుకు నాకీ మొండిబతుకు? (దగ్గు తెర)

కృపా : నాయినా (పట్టుకొని మంచంమీదకు తీసుకొని పోతాడు. అక్కడనుంచీ పరుగున వెళ్ళి మంచినీళ్ళు తెచ్చి తండ్రికి తాగిస్తాడు. నీలకంఠం స్తబ్ధుడై నిలబడి వుంటాడు. తిరపతికి దగ్గు తెర తగ్గుతుంది.)

నీల : నువ్వే నాబుద్ధిని మాలబుద్ధని నిందించావా నాన్నా ! నా కలువంటి ద్రోహం చెయ్యాలనే తలంపు మాత్రం లేదు. మానవుల్లో మానవుణ్ణే అస్పృశ్యుడుగా వెలి

వెయ్యటంలాంటి ద్రోహం నేనేమీ చెయ్యలేదే? పశువులకంటె హీనంగా చూడటానికీ ఊరి వెలుపలికి తరమటంలాంటి ద్రోహం నేనేమీ చెయ్యలేదే? కూటికీ, గుడ్డకీ మొహంవాచి కొంపోరిని దిక్కుమాలిన చావులు చంపే ద్రోహం నేనేమీ చెయ్యలేదే? ఇన్ని అవమానాలను తరతరాలుగా అనుభవిస్తూ చివరికి యేదో ఒకవిధంగా బయటపడాలని చేసినపని ద్రోహమెట్లా అవుతుంది? బావిపోటుతనమెలా అవుతుంది? నాన్నా నువ్వే చెప్పు! నీకడుపున పుట్టినవాడు అన్నివిధాలా ప్రయోజకుడై కూడా ఎందుకూ పనికిమాలినవాళ్ళ నోటినుంచీ మాలవాడని అగౌరవంగా పిలవబడటం చూచి సహిస్తావా? ప్రయోజకత్వంతో పాటు ఒకమనిషిగా తలెత్తి తిరగటం చూచి సంతోషిస్తావా?

తిర : యేంట్రా సంతోసం (లేచి) కన్నకొడుకుని 'కొడుకా' అని పిలుసుకోలేని బతుక్కి సంతోస మెక్కడ? 'నాయనా'అని కన్నా,'తమ్ముడూ' అని ఈణ్ణి పిలుసుకో లేకుండా దూరమౌతున్న నీగుండె యెంతరాతి గుండె రా! మమ్మల్నందరినీ వదిలి నువ్వొక్కడవే యేదో అక్కును సాదిచ్చాలని సూత్తుండావే, దాంతో లాబ మెవ్వరికి? నీకే – నీ వొక్కడికే! నీలకంటవని పెద్ద ఆస్తితో, పెద్దకులంతో గుటకలు మింగుతూ కూసుం టానికి నీ మనసెట్టా ఒప్పిందిరా? నాకొడుకివిగా వుంటానికే నీకు సిగ్గయితే యింకా శెప్పటానికూడా యెముకొచ్చావ్. నాకుముకం కూడా ఎందుకు సూపి

చ్చావ్? నచ్చి పోయింది నీలకంఠం బాబూ కాదు. నాకొడుకే నచ్చాడనుకుంటాను. నాముఖం కూడా నీక్కనబడనియ్యను. యీప్రాణ్ణేనే నేనిక వుండను. (నడుస్తూ)రా బాబూ—

కృపా: (తిరపతికి అడ్డం నిలచి) నాయనా; అన్నయ్యను విడిచి పెట్టి యెక్కడకు వెళ్ళిపోదాం? అన్న వెయ్యొస్తాడని రాత్రింబగళ్ళు యెదురుచూచి నచ్చిన తర్వాత యేంటి నాయనా యిదంతా?—

తిర: (గాద్గదికంగా) వచ్చింది అన్నయ్య కాదురా బాబూ. నీకసలు అన్నయ్యేలేడు. వున్నది నేనొక్కణ్ణే. నీకు పొరపాటు చెప్పాను. తప్పయింది రా తండ్రీ - (ముందుకు సాగబోతాడు.)

నీల: నాన్నా (కాళ్ళపైబడి) నీ కొడుకునిగా భావించుకో టానికి సిగ్గుపడేంత పశువును కాదు నాన్నా. నీల కంఠంగా చెప్పుకొని అక్కడే పెళ్ళాడి పెద్ద ఆ స్తితో తుల తూగాలని నేననుకోలేదు. నావుద్దేశమేమిటో చెప్పాను. కాని పరిస్థితులింత తీవ్రరూపాన్ని ధరిస్తాయని వూహించుకోలేదు. ఇప్పుడు నేనేం చెయ్యను. నేనే కొడుకునుగా భావించుకొని సంతృప్తి చెందిన సీతారామ్మ గారికి నీలకంఠం మరణవార్త చెప్పితే, ఆ మహాతల్లి జీవించగలుగుతుందా? చెప్పకుండా నా కన్నతండ్రికే ద్రోహం చెయ్యనా? యేం చెయ్యను చెప్పునాన్నా? నాన్నా...నాన్నా........(వలవల యేడుస్తాడు.)

తిర : అందన్నీ నంపు. అందరూ నీ క్షేత్రుల్లో నచ్చేవారే! అందరూ నీ క్షేత్రుల్లో నచ్చేవారే – రారా – (కృపానం దాన్ని తీసుకొని కుడివైపుకు దగ్గుతూ నిష్క్రమిస్తాడు.)

నీల : (అలాగే భూమ్మీదపడి యేడుస్తుంటాడు. అతని అంతర్వాణి పలుకుతుంది.)

అంతర్వాణి : పిచ్చివాడా! చేసిన తప్పుకు సిగ్గుపడక యేడవటం కూడా దేనికి—లే—

నీల : (సగం లేస్తాడు)

అంత : లే—

నీల : (పూర్తిగా లేస్తాడు) నీవెవరవు?

అంత : నీవే నేను.

నీల : ఆఁ...నేనే నీవా!

అంత : అవును.

నీల : అయితే; నాతోనే కలసివున్న నీవు నాకు వేరుగా వుండి మాట్లాడతావే?

అంత : నేనంతే; అందరితోనూ కలసివున్నట్లుండి, అందరికీ యిలా వేరుగా వుంటూ మాట్లాడతాను.

నీల : అవును, నాకూ అలాంటి అనుభవం యిప్పుడిప్పుడే గుర్తుకొస్తోంది.

అంత : అందరూ నా అనుభవాన్ని యిట్లాంటి పరిస్థితుల్లోనే గుర్తుకు తెచ్చుకుంటారు. అహంకారం కైపెక్కించిన స్థితిలో నన్ను చిన్నచూపు చూస్తారు. కాని చేతులు

కాలిన తర్వాత ఆకులు పట్టుకుంటే యేం ప్రయో
జనం ? నా వుపయోగం సర్వత్రా యిలాగే దురుప
యోగమై పోతోంది. సమయానికి నన్ను చక్కగా
వుపయోగించుకొనే సహనం మానవుల్లో కొరవడింది.
దాని ఫలితాన్ని అందరూ అనుభవిస్తున్నారు. నీవూ
అనుభవించు. నీవూ అనుభవించు —

నీల : అనుభవిస్తున్నాను - అనుభవిస్తున్నాను - అనుభవిస్తు
న్నాను కాని ఎందుకు నాకీ అనుభవం ఎదురైందో
అర్థం కావటంలేదు. నేనేం తప్పుచేశాను - నేనేం
తప్పుచేశాను ?

అంత : ఇంకా యేం తప్పుచేశాననే అజ్ఞానంలోనే వున్నావా ?
సామాజిక ప్రతిష్టను సంపాదించుకోటానికి నువ్వవలం
భించిన మార్గం యెటువంటిది ?

నీల : ఏటువంటిది ?

అంత : ఎటువంటిదా ? స్వార్థపూరిత మైనటువంటిది.

నీల : ఏమిటి స్వార్థం ? ఎవళ్ళది స్వార్థం ? యిలాగనే నువ్వు
మమ్మల్నందరినీ నిర్వీర్యుల్ని చేస్తున్నావు. నీ బలవంతం
వల్లనే శతాబ్దాలు గడిచినా మాకు విముక్తి లేకుండా
వచ్చింది. స్వార్థం స్వార్థం అని కళ్ళు మూసుకొని
కూర్చుంటే యెవరైనా దయతలచి మాకు మార్గాన్ని
చూపిస్తున్నారా ? ఎవరైనా అట్లా దయతలచిన
మహాత్ముడుంటే ఆయన వుపదేశాల్ని ఎంతమంది చెవి
నెట్టుకుంటున్నారు. మాగోడు యెవరి హృదయాల్ని

కదలిస్తోంది! అంతా, తియ్య తియ్యని కబుర్లు చెప్పే వారే! అంతా మొసలి కన్నీరు కార్చేవారే! ఇదంతా ఎవరి స్వార్థం? ఈ స్వార్థమానవ ప్రపంచంలో ఎవరూ యెవరి జన్మహక్కుల్ని నిలపరు. అందరూ అందరి జన్మ హక్కుల్నీ కొల్లగొడతారు. కూలదోస్తారు. నేల రాస్తారు.

అంత : నిజమే! ఇప్పుడు నీసంగతి చెప్పు. మాలవాడివిగా నీరూపు మాసిపోయింది. సరే! నీవాళ్ళంతా మాలవాళ్లుగానే వుంటే నీకేం ఫరవాలేదా? మానవుడివి గనుక హక్కుల్ని కోరావ్. సరే బాగానేవుంది. మానవుడివిగా బాధ్యతలను స్వీకరించాలని అప్పట్లో నేను గుర్తు చేశాను. జ్ఞాపకముందా? నామాటను పెడచెవిని పెట్టావు గనుక ఇటు తండ్రీ – అటు సీతారామ్మా ఇద్దరిమధ్యా యిరుక్కొనిపోయావు. మానవత ద్వారా గుర్తించిన హక్కుల్ని సాధించటానికి మానవతే ప్రాతిపదిక కావాలి. అందుకు బహిరంగంగా సమిష్టి కృషి చెయ్యటానికి బదులు – రహస్యంగా వ్యష్టికృషికీ తల పడ్డావు. అంతా తలక్రిందులైంది. ఇప్పుడు నీహక్కును గుర్తింపచేసిన మానవత గొంతునులిమి కన్నతండ్రికీ, మహాత్మమూర్తయిన సీతారామ్మకీ ద్రోహంచేసి విజయాన్ని సాధిస్తావా? లేక మానవతకే పట్టాభిషేకం చేసి కష్టాలను సహిస్తావా? చెప్పు–మాట్లాడవేం–నిన్నే!

నీల : కష్టాలను సహించటమా? కష్టాలు – కష్టాలు – ఇంకా యెన్నాళ్ళీకష్టాలు? నేను సహించలేను.

అంత : (వికటంగానవ్వి)సహించలేవా? మానవతనే గొంతు నులుముతావా? నీకాజన్మహక్కు! నువ్వు మనుష్యుడి వికావు.రాక్షసుడివి – రాక్షసుడివి–రాక్షసుడివి–

నీల : రాక్షసుణ్ణా – రాక్షసుణ్ణా – నేనురాక్షసుణ్ణా!

అంత : అవును.

నీల : కాదు.

అంత : అవును.

నీల : కాదు – నేనురాక్షసుణ్ణి కాదు – మానవుణ్ణి– మానవుణ్ణి మానవుణ్ణే – మానవత్వానికే పట్టాభిషేకం చేస్తాను.

అంత : అయితేవెళ్ళు –

నీల : వెళ్తాను –

అంత : వెళ్లు –

నీల : నాన్నా–(కుడివైపుకి 'నాన్నా నాన్నా' అనుకుంటూ పరిగెత్తుతాడు. 'వెళ్ళు, వెళ్ళు,' అని అంతర్వాణి పలుకు తుంది.)

[ నీల కంఠం వెళ్ళిన కొంతసేపటికి గోకర్ణం కుడివైపున తెరలోవుంటాడు. అతనితోపాటు విశ్వంకూడా వచ్చి వుంటాడు. ]

గోక : తిర్పత్తా – ఓరితిర్పత్తా – ఓ రారి – (ప్రవేశించి) తిర్పత్తా (ఇల్లంతాచూచి) పలకరేంచరే. లేరేంది. గన్నెవుండే సూడబోతే (కుడివైపుకిచూచి) దారా లేదుగద–

విశ్వం : (ప్రవేశం) ఆఁ... యెక్కడున్నారేరా?

గోక : మూడకాదురి–

విశ్వం : (అటూయిటూ తిరిగి) అవును. లేదే! బావగారిక్కడ వుంటారనుకున్నాం. ఇక్కడచూస్తే శిరపతి కుంటుబమే మాయమైపోయింది.

గోక : గింపులో యేందో తిరుగుతుందుండే!

విశ్వం : అదే నాకూ అనుమానంగా వుంది గోకర్ణం. ఇందులో యేదో పెద్ద రహస్యం దాగివుంది. మనమంతా యేదో కళ్ళు మూసుకొని ప్రవర్తిస్తున్నాం. వచ్చినవాణ్ణి పెళ్ళి చేసుకోరా బాబూ అంటే ససేమిరా నాకొద్దని భీష్మించుకూర్చున్నాడు. పోనీ పెళ్ళివద్దన్న పెద్ద మనిషి ఇంట్లోనే వుండాలా? లేడు. ఆఖరికి వూళ్ళో కూడా కనిపించటం లేదు. ఇక్కడ మూడుకాళ్ళ ముసలివాడూ పిల్లవాడితో పాటు కనిపించటం లేదు. ఈ సంఘటనల కన్నింటికీ లింకున్నట్టుగా నీకేమైనా తోస్తోందా గోకర్ణం?

గోక : తోసటవేంది; నిజంగం తేనుండే – పెద్దోరగారికీయిసయాలన్నీ తోసవ్. బుర్రగలోరు జరా మీరే కూపీ తియ్యండి దోరా?

విశ్వం : యేమన్నావ్?

గోక : కూపీ–

విశ్వం : ఆఁ...'కూపీ' దీన్నే ఇంగ్లీషులో డిటెక్షన్ అంటారు గోకర్ణం.

గోక : గట్నా – నాకెరికె లేదులే దొరా–

విశ్వం : ఒక్క నీకే కాదు. మా నాన్నలాంటివాడికే తెలియదు. కృష్ణా – రామా – అనుకోటానికి తప్ప మన భారతీయులెందుకూ పనికిరాకుండా పోయారు. అమెరికా – ఇంగ్లండు దేశాల్లో ఈ కూపీ – అనగా డిటెక్షన్‌లో ప్రతిఒక్కరూ ఆరితేరిన ఘటసే...నడుస్తావుంటే కాలికి తగిల్తే చాలు...

గోక : యేందుండది ?

విశ్వం : వెంట్రుకముక్క–అక్కడనుంచే కూపీతియ్యటం ప్రారంభిస్తారు. ఈ వెంట్రుక స్త్రీదా? పురుషునిదా...ఊఁ...

గోక : పురుసునుది–

విశ్వం : .........స్త్రీది...ఆస్త్రీ యెంత వయస్సులో వుండి వుంటుంది ? ఊఁ......పదహారేళ్ళపడుచు. అయితే యీ వెంట్రుక యిక్కడెందుకు రాలింది...ఊఁ... ఎవడో దుర్మార్గుడు బలాత్కరించుకోవాలి పోతుంటే రాలింది. ఎవడా దుర్మార్గుడు...ఇప్పుడెక్కడున్నాడు. ఈ ప్రకారంగా కూపీతీసి చివరికా దుర్మార్గుణ్ణి పట్టి బంధించి ప్రభుత్వాని కప్పగించేస్తారోయ్ బడపా–

గోక : నాకడుపుడ్క – గీడ శనాయెంటికె లూడివడుంటయ్ గద్దొరా?

విశ్వం : అవునోయ్ – వుంటయ్! కూపీతియ్య గలిగేవాడుంటే ప్రతిఒక్క వెంట్రుక వెనుకాదాగివున్న దుర్మార్గుడి జీవిత

చరిత్రను బయటకు లాగొచ్చు. దానివల్ల దేశానికెంతో లాభం కలుగుతుంది.

గోక : (నేలకంటూవంగి వెతుకటం ప్రారంభిస్తాడు.)

విశ్వం : యేమిటిగోకర్ణం వెతుకుతావ్?

గోక : గిదేనుండే - యింటిగ్యుటుందేకోని-

విశ్వం : నీతెలకాయ్. ఇప్పుడు మనకు వెంట్రుక ముక్కలతో పనేమీలేదు. (తనూవంగి పరిశీలిస్తుంటాడు. ఒకపాకెట్ దొరుకుతుంది. దానిని త్వరత్వరగా విప్పిచూస్తాడు. అందులో ఒకపద్దునిక్కరూ వుంటాయి.) గోకర్ణం చూచావా కూపీప్రారంభమైంది.

గోక : గట్నా-

విశ్వం : అవును. ఇప్పుడిప్పుడే యీపాకెట్ను యెవరోయిక్కడకు తీసుకొచ్చారు. విప్పికూడాచూచుకోలేదు.

గోక : (పరీక్షగాచూచి గుర్తుపట్టి) గిదినీల్కంటకం దొరదే నుండే - గాయనబిస్త్రోపడుండది. తిర్పతిగాడి కొడుక్కి యిక్క సరిగ్గుంటయ్దొరా-

విశ్వం : అలాగా! అయితేవాడికే బావ, బహుమానం తెచ్చాడు.

గోక : గట్టయితేనాకదుపుడ్క్ నీల్కంటకందొర గిసుంట వచ్చిందుంట్రా?

విశ్వం : ఊం తప్పకుండావచ్చివుంటాడు. అతడురావటమే వీళ్లంతా వెళ్ళిపోవటానికి కారణమైవుంటుంది. ఈసందర్భంలో కామందు చరిత్ర తెలియటం చాలాఅవుసరం. అతని చరిత

తెలుసుకోవాలంటే అతనిక్కడికి వ్రాస్తున్న ఉత్తరాలు దొరకాలి. గోకర్ణం.

గోక : దొరా—

విశ్వం : ఊఁ... కానీ - ఈ యింట్లో కాసులు వ్రాశిన వుత్తరా లెక్కడవున్నాయో వెతుకు. (ఇద్దరూ యిల్లంతా గాలి స్తారు. ఆఖరికి గోకర్ణం దేవదారుచెక్కలపెట్టె తెరచి ఒక్కొక్క వస్తువు బయటికి పారేస్తుంటాడు. వాటితో పాటు ఉత్తరాలుకూడా బయటికి విసురుతాడు.

విశ్వం: (చేటంతముఖంచేసుకుని వుత్తరాలనుచూచి)ఆగు! (వుత్త రాలనుచేతికి తీసుకుంటాడు.)

గోక : శిక్కానాదురి—

విశ్వం : చిక్కిందోయ్ మిడతంభొట్లూ - యికదీంతో కథ నడి పిస్తాచూడూ (కుడివైపుకినిష్క్రమణ)

గోక : నా - క - డు - పు - డ్క— (విశ్వాన్ని అనుసరిస్తాడు.)

[ తెర - ]

—:o:—

# నాలుగో దృశ్యం

[ ఒకటి, రెండు దృశ్యాల మాదిరిగానే రంగాలంకరణ వుంటుంది. సాంబమూర్తి గీతాపారాయణం చేస్తుంటాడు. సీతారామమ్మ రాట్నం వడుకుతూ వుంటుంది. గీతను అవగాహనం చేసుకోవటంలో సీతారామమ్మకు చేతిలోపని అడ్డురా కూడదు. ]

సాంబ : అథచైనం నిత్యజాతం నిత్యం వామన్యసే మృతం
తథాపిత్వం మహాబాహో నైనం శోచితుమర్హాసి.

(వ్యాఖ్య) జననమరణము లేని యీ ఆత్మను, దేహధారణ సమయమున పుట్టు దానినిగ, దేహమును చాలించు సమయమున మరణించు దానినిగ, ఒకవేళ భావించినను; వీరుడవగు ఓ అర్జునా ! నీవిట్లు శోకింపతగదు.

అమ్మాయీ ! అసలు పుట్టటం గిట్టటం అంటూ లేని ఆత్మ పదార్థం దేహాధారణ చేసినప్పుడు పుట్టిందనీ, దేహాన్ని విసర్జించినప్పుడు గిట్టిందనీ మనమనుకునేదంతా కేవలం భ్రమ.

జాతస్య హి ధృవో మృత్యు ర్ధ్రువం జన్మ మృతస్య చ
తస్మా దపరిహార్యేర్థే న త్వం శోచితు మర్హాసి.

(వ్యాఖ్య) ఎందుకుగాను పుట్టినటువంటివాడు చనిపోతాడో; మళ్ళా యేకారణంచేత చనిపోయినటువంటివాడు పుడతాడో – ఆకారణాలచేత నువ్వు పండితుడవై కూడా ఎవరిచేతా తప్పించటానికి వీల్లేని యీపని చెయ్యటానికి దుఃఖపడకుము

మహాదేవశంభో! కర్మ పరిపక్వదశకు రానందువల్ల చని పోయినవాణ్ణికూడా ఆ భగవంతుడు తిరిగి శరీరాన్నిచ్చి పుట్టిస్తున్నాడే – అలాగే పుట్టిపెట్టువంటి వాణ్ణికూడా తన యిష్టమొచ్చినప్పుడు చంపి వూరుకుంటున్నాడే – అలాంటప్పుడు మనం యీ జనన మరణాలను గురించి పట్టించుకోని యేడ్వటం శుద్ధ మూర్ఖత్వం గాకపోతే యేమిటి? అహహ. (కన్నులరమోడుస్తాడు.)

సీతా: అన్నయ్యా! నీలకంఠం బయటికి వెళ్ళినవాడు తిరిగి రాలేదేమిటి?

సాంబ: (గీతనుమూసి) రాకెక్కడికి పోతాడులే మహాదేవ శంభో! (లేచి గీతను టేబిలుమీద పెట్టి) చూచిరావటానికి మన యోధాన యోధులిద్దరూ వెళ్ళారుగా – ఇక మొత్తం ముగ్గురినీ వెతికిరావటానికి నన్ను బయలు దేరమంటావా?

సీతా. ఆఁ...యెందుకులే వాళ్ళే వస్తారుగాని – పెళ్ళి వ్యవహారమే మొండిన పడినట్టుంది. వాడికింకా యేం చెప్పి మాత్రం యేం ప్రయోజనముంటుంది చెప్పు?

సాంబ: ప్రయోజనం లేకపోతేపోనీ కొన్నాళ్ళపాటు వాయిదా వేసి చూద్దాం. ఇప్పుడు ముంచుకుపోయింటి మాత్రం యేముంది. ఇద్దరూ ఒకయింట్లో వుండేవాళ్ళేగా! అయినా యింత మొండివట్టు వడతాడని మనకు మాత్రం యేం తెలుసు? ఏదో వేడిలో వేడి కలిసి పోతుందని అవధాన్లుగారిని దగ్గరోనే ముహూర్తం చూడమయ్యా అంటే సరేనని చూచాడు. యేదో కొన్ని

చిల్లరా మల్లరా పనులు పూర్తిచేశాననుకో! అవేమీరా వృథాపోయేవికావు. పిలునుబట్టి మళ్లా యెప్పుడో ముహూర్తం పెట్టించేస్తాం. అయిపోతుంది. ఆఁ...

సీతా: సరే; ఆ తర్వాత జరిగేదేదో జరుగుతుందిగాని ఇంతకీ వీడు పెళ్ళిచేసుకోటాన్కి సుముఖంగా లేకపోవటం యెందుచేతనో? నాకర్థం కావటం లేదన్నయ్యా!

సాంబ: ఆఁ...ఇందులో అర్థం గాకపోవటానికేముంది లేవే పిచ్చిదానా! ఇదుగో అమ్మాయ్; నేనొక్కమాట చెప్తాను చూడు. నీకొడుకున్నాడే వాడు నాకొడుకు. లాంటి టొలాటోలి వ్యవహారంగాడు మాత్రంగాదు. విశ్వంగాడి బుద్ధే గనుక వాడిదైతే ఆ చిన్న వయస్సులో తల్లినీ, మేనమామనీ కాదని కొంప విడిచిపెట్టిపోయి ఇంత ప్రయోజకుడుగా తిరిగి వచ్చేవాడనా? అబ్బే! ఛీ అంటే మాత్రం మావాడు గడప వదలుతాడేమో చూడు. చస్తే వదలడు. వదలకపోతే పోయాడు. ఇక్కడుండికూడా యేమిచేస్తున్నాడో చూస్తున్నావుగా! వట్టి అడ్డగాడిద. ఆ అడ్డగాడిదనే పెళ్ళిచేస్తానని చూడు. ఎగిరిగంతేస్తాడు. ఖక్కనుకా – మీవాడు పెళ్ళిచేసుకోనూ అని అంటున్నాడంటే వాడన్నట్లు వెనకా ముందూ బాగా ఆలోచిస్తున్నాడన్నమాట. అంతకంటే యింకే మర్థముంటుంది మహాదేవశంభో—

సీతా: అల్లుణ్ణామాత్రం వెనకేసుకోకపోతే యెట్లాగులే! పెళ్లీడుకొచ్చిన కూతురు ఇంట్లోవున్న వాళ్ళందరూ అనే మాటలే యివి.

సాంబ : అబ్బెబ్బెబ్బె! నువ్వట్లా అనుకుంటున్నావా? వాడు నాకూతురును చేసుకోకపోయినా వున్న విషయం చెప్పటానికి మాత్రం వెనకడుగు వేశేవాణ్ణికాదు మహా దేవశంభో! (త్వరత్వరగా విశ్వం, గోకర్ణం కుడినుండి ప్రవేశం) ఆఁ...యేమిట్రా మీరిద్దరే వచ్చారూ!

విశ్వం : (సీరియస్సుగా కుర్చీలో కూర్చోని తెచ్చిన వుత్తరా లను పాకెట్టులు టేబిలుమీదపెట్టి - వుత్తరాలను ఒక్కొక్కటి తీసి కొద్దికొద్దిగా చదివి టేబిలుమీద పెట్టేస్తాడు. అక్కడనుంచీ టక్కుని యేదో గుర్తుకొచ్చి డ్రాయరులోనుండి కొన్ని వుత్తరాలను తీసి రెండు రకాల వుత్తరాలను చాలా జాగ్రత్తగా పరిశీలిస్తూ వుంటాడు.)

సాంబ : మాట్లాడరేరా; బెల్లంకొట్టిన రాళ్లులాగా! గోకర్ణం - నీలకంఠం వారి కనపడలా?

గోక : గదే శిన్నదొర కూపీ తీస్తడంట దొరా.

సాంబ : కూపీ యేమిట్రా నీమొఖం కనపడలేదా?

గోక : మరేనుండె-

సీతా : (లేచి నచ్చి) తిరపతి యింటికెళ్ళి చూచొచ్చారా?

గోక : సూశినాం దొరసానే! తిర్పతే యాడకో పోయిండు. ఇల్లు ఖాళీ బడుండది.

విశ్వం : గోకర్ణం - ఒక్క గ్లాసుడు మంచినీళ్లు సప్లయిచెయ్యా వోయ్. (గోకర్ణం ఎడమవైపుకు వెళ్ళబోతాడు.)

సాంబ: (గోకర్ణంతో) ఆపని నేం చేస్తాంగాని నువ్వెళ్ళి నీల కంకం దొరసంగతి చూడు. (గోకర్ణం తిరిగి కుడివైపుకి నిష్క్రమిస్తాడు. సీతారామ్మ లోపలికి వెళ్ళి మంచినీళ్ళు తెచ్చి విశ్వానికిస్తుంది.)

విశ్వం: (గటగటా మంచినీళ్ళు తాగి) ఓహోహో! అత్యాశ్చర్య కరమైన అద్భుత విషయాలు బయటపడబోతున్నాయ్ అత్తయ్యా!

సీతా: ఏమిట్రా చెప్పరాదూ!

విశ్వం: తొందర పనికిరాదత్తయ్యా! ఈ పరిశోధన మెదడును వెన్నపూసలా కరిగించేసింది. అప్పుడుగాని నాకు కొన్ని ఆధారాలూ - ఆనవాళ్ళూ దొరకలేదు. వాటిని బట్టి నరాలు తెగిపోయేటంత రహస్యమొకటి బట్టబయలైంది. గీతాపారాయణంలో మునిగివున్న మీరు వాతావరణం విషమించిన సంగతి అంతుబట్టలేకపోయారు. ఇదే యే అమెరికా - బ్రిటన్......

సాంబ: నోరుముయ్యరా. (విశ్వాన్ని అసహ్యంగా చూచి) మహాదేవశంభో (లోపలికి వెళతాడు.)

విశ్వం: అత్తయ్యా నీ ఆజ్ఞ యేమిటి?

సీతా: ఇంతకీ నువ్వేమైనా చెప్పదలచుకున్నావా? అంతా వేళాకోళమేనా?

విశ్వం: నన్ను మీరు ముందుకు సాగనిస్తేనా? ఒకరు నోరు ముయ్యమని, మరొకరు వేళాకోళమని గందరగోళం

చేస్తే ఇదేమైనా గీతాశ్లోకమా రెండు పంక్తుల్లో చెప్పే యటానికి! అపరాధ పరిశోధన! అంతులేని అనంత విద్య! అందుకు చాలా టైం తీసుకుంటుందత్తయ్యా!

సీతా: ఇంతసేపైనా నువ్వింకా ఉపోద్ఘాతంలోనే వున్నావ్.

విశ్వం: అయిపోయిం దయిపోయింది. ఇక ప్రారంభించేస్తాను – గోకర్ణాన్ని సహాయమిచ్చి మీరేకదా నన్ను బావ గారిని వెతికి పట్టుకోమని చెప్పింది?

సీతా: ఇందులో వెతికి పట్టుకోటానికి ఏముంది? 'బయటకు వెళ్ళి చాలాసేపైంది పిలుచుకొనిరారా' అన్నాం.

విశ్వం: అదే అన్నారనుకోండి, నేను కాస్త డిటెక్టివ్ పరిభాషలో చెప్పాను; అంతే! అక్కడనుంచి ఇద్దరం బయటపడి గ్రామాన్నంతా గాలించివేశాం. ఎక్కడా బావజాడ కనిపించలా. నాకప్పుడొక మాంచి ఐడియా తట్టింది. గోకర్ణాన్ని వెంటేసుకుని తిన్నగా తిరపతిగా డింటికెళ్ళాను. వెళ్తే ఏముందీ–ఇల్లంతా ఖాళీ! అక్కడ ఒక్క పురుగ్కూడాలేదు. ఏమిటీ విచిత్రం? ఎందుకీ సంఘటన? అనే ప్రశ్నార్థకాలు నా కెదురుగావచ్చి నిలబడ్డాయి. అప్పుడు నాకక్కడ (పాకెట్ అందుకొని) ఈ పాకెట్ దొరికింది. (పాకెట్టు విప్పుతూ)ఇందులో ఈ వస్త్రా ఈ నిక్కరూ వున్నాయి. వీటిని ఆయింట్లో వుండే కృపానందానికి ఎవరో బహుమానంగా తెచ్చారని మనలో ఎవరైనా గ్రహించుకోవచ్చు. అయితే

ఆవ్యక్తి యెవరు? అతడు రాగానే ఆయింట్లో ఎవరూ లేకుండా ఎందుకుపోయారు? బహుమానం నిరర్థకం గావటానికి గల కారణమేమిటి? అనే సందేహాలకు మాత్రం ఎవరూ అంత తేలిగ్గా సమాధానాలు చెప్పకో లేరు. కాని నేను - నా శక్తినంతా ధారపోసి ఈ సంఘటనలో నీలకంఠం బావ చెప్పకుండా వుంచి ప్రటాపని పసిగట్టేశాను. అప్పుడు నాకు కాసులు చరిత్రకూడా అవసరమని తోచింది. వెంటనే గోకర్ణాన్ని పురమాయించి ఇల్లంతా జల్లకడిగినట్లు కడిగి ఇక్కడో (ఉత్తరాలందుకొని) ఈ వుత్తరాలు సేకరించాను. అక్కడ నుంచీ హుటాహుటి కాలినడకన ఇంటికి వచ్చేసి కాసులు వ్రాసిన ఈ వుత్తరాలను పరిశీలించటం మొదలు పెట్టాను. నాకప్పుడూ ఈ దస్తూరి యెక్కడో చూచినట్టుగా వుందే అనే అనుమానం ఎగదట్టింది. వెంటనే బావ మనకు వ్రాస్తూ వచ్చిన లేఖావళిని బయటకు లాగాను. రెండింటిని పోల్చి చూశాను. చూశేసరికి ఏముందత్తయ్యా-

సీతా: ఏముంది నాయనా చెప్పి ఆగిపోయావే?

విశ్వం: కొంపలంటుకుపోయే రహస్యం యిందులో దాగివుందత్తయ్యా -

సీతా: ఏమిటది?

విశ్వం: (ఉత్తరాలను రెండు చేతుల్లోనూ పట్టుకొని) ఈ రెండు రకాల వుత్తరాలనూ వ్రాస్తూన్న వ్యక్తి ఒక్కడేనని మన పరిశోధనవల్ల బయటపడింది.

సీతా : ఏమిటి నీపరిశోధన ? (మందలింపుగా) నువ్వు బొత్తిగా మీనాన్న చెప్పినట్టుగానే వట్టి ఆకతాయి మనిషి నైపోతున్నావ్. బ్రతకటానికి పెద్దలు సంపాదించిన ఆస్తి చేతినిండా వుంటే సరిపోతుం దనుకున్నావా ? మనిషన్న తర్వాత ప్రతివొక్కడూ కాస్తో కూస్తో ఇంగిత జ్ఞానాన్ని సంపాదించుకోవాలి. కష్టపడి సంపాదించుకోవాల్సిన అవసరం తీరిపోయిందని చెప్పి అనవసర వ్యాసంగాలూ - అప్రస్తుత కార్యక్రమాలలో బ్రతుకంతా వ్యయం చేశేస్తావా ? బావను తీసుకొని రమ్మని ఒక చిన్నపనిని నీచేతికప్పగిస్తే అపరాధ పరిశోధననీ, నల్లకాడనీ నీ బుర్రను చెడగొట్టుకోవటంగాక మా కొంపకూడా నిప్పెక్కించాలని చూస్తున్నావా? నాయనా విశ్వం. ఇన్నేళ్లొచ్చాయ్. ఇప్పటికైనా కుదురుగా బ్రతగ్గలగటం నేర్చుకోరా ! పదిమందిలోనూ ఎందుకు నగుబాట్లపాలౌతావ్.

విశ్వం : అత్తయ్యా ! మాకు తల్లిలాంటి దానివి. తప్పుచేస్తే మందలించే అధికారం నీకు తప్పకుండా వుంది. కాని ఈ విషయంలో మీరు నామాటలు పెడచెవిని పెడితే మన కుటుంబానికి కుటుంబం యావత్తూ పదిమందిలోనూ నగుబాట్లపాలుకాక తప్పదు. ఈ రెండు రకాల వుత్తరాలనూ మీరే పరిశీలించండి. ఈ దస్తూరి - ఈ సిరా - ఆఖరికి కొన్ని వుత్తరాలకు వాడిన కాగితాలు కూడా ఒకే విధంగా వున్నాయని మీకే తెలుస్తుంది.

(సీతారామమ్మ ఉత్తరాలను తీసుకొని పరిశీలిస్తుంది.)
దీనివల్ల నాకు కలిగే అనుమానం ఒక్కటే ఒకటి. అది నీలకంఠం – కాసులూ అనే యిద్దరు వ్యక్తులు అసలు లేనే లేరని – వుంటే కాసులో – లేకపోతే నీలకంఠం బావో ఎవరో ఒక్కరు మాత్రమే రెండు పేర్లతో వుత్తర ప్రత్యుత్తరాలు జరుపుతూ వుండాలి; అంతే!

సీతా : నువ్వేమిటో పెద్దచిక్కే తెచ్చి పెట్టావురా విశ్వం. ఈ బహుమానాన్ని కాసులు నీలకంఠంచేత కృపానందానికి పంపించాడనుకున్నా; నువ్వన్నట్లు వుత్తరాలు మాత్రం ఒకేరకంగా వున్నాయి. అయితే కాసులు కూడా వస్తానని తిరపతికి వ్రాసినప్పుడు ఈ విధంగా ఎందుకు జరిగిందో మనమెందుకు అనుమానించాలి? ఇద్దరిలో యెవరో ఒకరు ఎప్పటికీ వుత్తరాలు వ్రాస్తూ వచ్చారేమో!

విశ్వం : సరే; మీ అనుమానాన్ని కూడా అంత తేలిగ్గా కొట్టి పారేయటానికి వీల్లేదు. కానీ – కాసులనేవా డసలింత వరకూ రానేరాలేదు చూశారా! ఈ లోపలే బావ తిరపతింటికి వెళ్ళటం; అక్కడ ఏం జరిగిందో ఏమో గాని – మొత్తంమీద అంతా కలిసి కనిపించకుండా మాయమైపోవటంవల్ల మనం తప్పకుండా అనుమానించే తీరాలి.

సీతా : వాళ్ళు మాయమయ్యారనే యిప్పుడెందుకు అనుకోవాలి. ఎక్కడకు వెళ్ళారో యేమిటో_

విశ్వం : అలాగే అత్తయ్యా! మీ మాటమీదే ఇంకా ఈవాళ్లా ఆగమన్నా ఆగుతాను.

సీతా : అయినా ఈ విషయం నాన్నకూడా చెప్పి చూడు; వెళ్ళు–

విశ్వం : మహాదేవశంభో! ఆపని మనవల్ల గాదు. మీరే వెళ్లండి. (సీతారామ్మ ఉత్తరాలు, మర్రు నిక్కగా తీసుకొని లోనికి వెళ్ళుతుంది) నా పరిశోధనను ఆయనెక్కడ అంగీకరిస్తాడు. (ఆలోచిస్తూ) ఇంతకీ ఇంకా కొన్ని వివరాలు దొరికితే బాగుండును. (గోకర్ణం విచారంగా ప్రవేశం) ఏరా, ఏం జరిగింది ?

గోక : దొరగారున్న డుండె–

విశ్వం : ఎక్కడ ?

గోక : తిర్పతిగాడింట్ల–

విశ్వం : ఏం చేస్తున్నాడక్కడ ?

గోక : తిర్పతిగాడు సచ్చిపోయిండు దొరా! గాణ్ణే దొర యిశారపడుతున్న డుండె–

విశ్వం : ఆఁ...తిరపతిచచ్చిపోయాడా? ఎట్లా చచ్చిపోయాడంటాడే

గోక : పాణంబోయి సచ్చిండంట దొరా! ఆడి కొడుకొకటే ఏడుపు.

విశ్వం : అందరూ ప్రాణంపోయేరా చచ్చేది. నేనడిగేది – దెబ్బలవల్లనా ? ఎందులోనైనా మునిగా ? లేక విష ప్రయోగమేమన్నా జరిగిందా అని –

గోక : గడంత నా కెరికెళ్తేన్దొరా !

విశ్వం : సరే; ఆవిషయమంతా నేను పరిశోధించి తెల్చుకుంటాను మరి ఆయన్ను వెంటబెట్టుకొని తీసుకొనిరాలేదే ?

గోక : నేనొత్తేంసే పదన్నడు దొరా ! ఇంగొత్తనే వుంటడు.

విశ్వం : అలాగా – లోపలికెళ్ళి చెప్పివిషయం.

గోక : గట్నే దొరా; మరిగ త్తే – మీాకేందో కూాపీ తీ స్తనన్న మగంద; యూాన యిందుండది ?

విశ్వం : ఇంకా ఏమైందోననే అనుమానంలోనే వున్నావా పిచ్చిదద్దమ్మా ! బావగారంత మొనగాడని యింత మొనగాడని పల్లకీ మొయ్యటానికి సిద్ధమైన మన పెద్ద లికి వున్నట్టుండి ఒక్కసారిగా కళ్ళు తెరిపించాను. ఈ దెబ్బతో బావగారి ప్రతాపం కాస్తా బ్రద్దలై మన ప్రతాపమేమిటో యీా జనానికంతా కళ్ళకు కట్టినట్టు కన్పిస్తుంది. అప్పుడైనా నన్ను తేలిగ్గా చూాట్టం తగ్గించు కుంటారో లేదో కాస్తాగి చూాడాలి.

గోక : నాగ్గూడ గారగస్యం శెవినేత్తురో–

విశ్వం : అందరితోపాటు నీకూా తెలుస్తుంది. (గద్దించి) ముందు నేను చెప్పిన పనిచెయ్యి.

గోక : నీకాల్మొక్తా – పోతనే వుండగంద. (లోపలికి వెళ్తాడు.)

విశ్వం : (దీర్ఘాలోచనలో) తిరపతి హాఠాన్మరణంలో గల రహాస్యమేమిటి ? రేపో మాాపో వస్తాడని యెదురుచూాస్తున్న

కాసుల్ని గురించి కొత్తగా ఏమైనా వర్తమాన మందిందా? ఆ వర్తమానం తిరపతిగుండెపోటి చచ్చేటంత ఘూరమైందా? అబ్బా అన్నీ ప్రశ్నలే! అంతా గజిబిజి. ఈ బిజినెస్సులో కామన్ సెన్సు ఈజ్ వెరీ ఎస్సెన్షియల్; వెరీ ఇంపార్టెంట్! (కుర్చీలో కూర్చొని టేబిలుమీద మోచేతులానించి అరచేతుల్లో తలకాయను గట్టిగా ఇరికించి ఆలోచిస్తుంటాడు.)

[ శోకమూర్తిగా నీలకంఠం అత్యంత నిగ్రహంతో కుడి వైపునుండి ప్రవేశిస్తాడు. చుట్టూ కలయజూచి, చివరకు ఎదురుగా గోడలకు తగిలించివున్న ఫోటోలను భావ గాంభీర్యంతో ఒక్కటొక్కటిగా పరికిస్తాడు. ఆఖరికి మహాత్ముని పటం ముందుకొచ్చి నిలబడి ముంచు కొస్తున్న దుఃఖోద్వేగాన్ని బలవంతంగా ఆపుతాడు. కాని బరువన శోకధ్వని వినవొస్తుంది. ఆధ్వని విశ్వం దీర్ఘాలోచనను భంగపరుస్తుంది! ]

విశ్వం : అరె; బావగారా! (లేచి) రండి కూర్చోండి. (సమీపించి విచారంగా) పాపం! తిరపతి చనిపోయాడట గదండీ?

నీల : (గంభీరంగా) అవును. (కుర్చీలో కూర్చుంటాడు.)

విశ్వం : ఇంత హఠాత్తుగా ఏం ప్రమాదమొచ్చిందో?

నీల : ఏదో ప్రాణం తీసేది–

విశ్వం : లేకపోతే యెట్లా మరణిస్తాడులెండి పాపం! ఆఁ... (బిగ్గరగా) ఒరే గోకర్ణం: బావగారొచ్చారని చెప్పు. (నీలకంఠంవైపు పరీక్షగా చూచి కుడివైపుకు నిష్క్రమణ)

[ సీతారామ్మ, గోకర్ణం, సాంబమూర్తి ప్రవేశం. సాంబమూర్తి, ఉత్తరీయం చేతికర్రతో బయటకు వెళ్ళే ప్రయత్నంమీద వుంటాడు. ]

సీతా : (నీలకంఠాన్ని సమీపించి) తిరపతి పోయాడా నాయనా?

నీల : (లేచి) అవును.

సీతా : (విచారంగా) కొడుకును చూచుకొనే వ్యవధికూడా లేకపోయింది. కాసులు వస్తున్నానని వ్రాసినదగ్గర నుంచీ పాపం తండ్రీ – కొడుకుళ్ళిద్దరూ ఒకటేయిదిగా ఎదురుచూస్తున్నారు. అతడెప్పుడో స్తాడోగాని ఆ పసి వాడు మాత్రం దిక్కులేనివాడైపోయాడు.

సాంబ : 'జాతస్యహిధ్రువం మృత్యు' పుట్టినప్పుడే మరణంకూడా వ్రాసిపెట్టి వుంది – యేంచేస్తాం (గోకర్ణంతో) పదరా గోకర్ణం చూచొద్దాం. మహాదేవశంభో – (గోకర్ణం, సాంబమూర్తి కుడివైపుకు దీనంగా వెళతారు.)

సీతా : అతనికి ప్రమాదంగా వుందని నీకెట్లా తెలిసింది ?

నీల : తెలిసింది——

సీతా : మన విశ్వం, గోకర్ణం యింతకు ముందొకసారి వస్తే అక్కడెవరూ లేరటగా——

నీల : (చలించి) ఎందుకొచ్చారు ?

సీతా : నీకోసం పంపిస్తే వెతుకుతూ అక్కడకు వచ్చారట. అక్కడొక చొక్కా లాగూ కొత్తవి పొట్లంగట్టి పడు న్నాయని తెచ్చారు.

నీల : అవును; నేనే వాటినక్కడకు కృపానందానికి బహుమాన మిద్దామని తీసుకెళ్ళాను. ఇంట్లో యెవరూ లేక పోతే; వాటినక్కడ వదేసీ...

సీతా : వైద్యునింట్లో వుంటారని వెళ్ళావా నాయనా ?

నీల : ఆఁ...అవును; అప్పటికే అతని పరిస్థితి విషమించి పోయింది. ఇంటికి తీసుకొచ్చాం. తీసుకొచ్చిన కొద్ది సేపటికే – (విచారం)

సీతా : చనిపోయాడా బాబూ – నీతో పాటే దేశాంతరం వెళ్ళి తిరిగి వచ్చేయాలనుకునే సరికి తల్లీ తండ్రీకూడా అతనికి దూరమైపోయారు. అతడు దూరమైపోయిన విచారమే ఆకస్మికంగా తిరపతి మరణానికి కారణం. సంతానం మీదవుండే మమకారం మానవులనే కాదు; సమస్త ప్రాణికోటినీ పెనవేసుకొని వుంటుంది. తిరిగి వచ్చి నీవు నాకాకొరత లేకుండా చేశావు తండ్రీ !

నీల : (మనసారా) అమ్మా – నేను నీకంత వుపకారం చేశానామ్మా—

సీతా : అమ్మా...అమ్మా అనిపించుకొనే నా జన్మహక్కునే నీవు నిలబెట్టావు బాబూ. దాన్ని కేవలం వుపకారమనే అనకూడదు. అది మనందరి కర్తవ్యం. నేనూ ఒక తల్లికి నా కర్తవ్యాన్ని నెరవేర్చి అదే భిక్ష నాకు నాసంతానం ప్రసాదించాలని ఎన్నెన్నో కలలు గని నిన్ను నవ మాసాలూ మోశాను. చివరికి నీవు నా చేతులకడ్డంగా దొరికి నా స్త్రీ జీవితాని కానందాన్నిచ్చావు. ఆ ఆనం

దాన్నే నీపెదవులు దాటివచ్చే 'అమ్మా' అనేమాట యిప్పటికీ కలిగిస్తోంది. ఎప్పటికీ కలిగిస్తుంది నాయనా !

నీల : అబ్బా; ఇంత బలీయమైన మాతృవేదనను నువ్వెట్లా సహిస్తానమ్మా – నేనేం చెయ్యాలిప్పుడు ? ఎట్లా తప్పించుకొని పోయేది—

సీతా : ఉద్యోగ ధర్మంలో నా బిడ్డవిగా నువ్వెక్కడున్నా 'అమ్మా' అనే నీపిలుపు నాకందుతుంది తండ్రీ. తప్పించుకొనిపోయే అవసరం నీకేమీ వుండదు. రెక్క లొచ్చిన నిన్ను నేనే స్వేచ్ఛగా వొదులుతాను. నీ స్వేచ్ఛలోనే నా ఆనందం యిమిడివుంది. నీమీద నాకుగల అనురాగం బాధాకరం కానీయను. కాని... ఇంతకుముందే విశ్వం, నీవూ కాసులూ వ్రాస్తున్న వుత్తరాలు ఒకే దస్తూరితో వున్నాయని వాటిని తెచ్చి చూపించాడు. అవి చూడటానికి కూడా అలాగే వున్నాయి. కాసులు వ్రాయలేకపోతే నువ్వే వ్రాస్తూ వచ్చావా ? ఏమిటి నాయనా సంగతి ?

నీల : (బాగా చలించి) అతనికి కాసులు వ్రాసిన వుత్తరా లెక్కడ దొరికాయి ?

సీతా : ఏమిటో నాయనా ! వాడి వ్యవహారం ఈ యింట్లో యెవరికీ నచ్చదు. తిరపతి యింటికి వెళ్ళినవాడు మీ రెవ్వరూ లేరని తిరిగి రావచ్చా – దిక్కుమాలిన పని శోధనంటూ ప్రారంభించి; ఆగుడ్డలు—కాసులు వ్రాస్తూ వచ్చిన వుత్తరాలూ పెల్లగించుకొచ్చాడు. కాసులు

వ్రాయలేకపోతేనో మరేకారణంచేతనో రెండు రకాల ప్రత్తరాలూ మీబావే వ్రాశాడేమో లేరా అన్నాను. అంతేనా ?

నీల : అంతేనా ?

సీతా : అదే నాకు తెలియక నిన్నడుగుతున్నాను బాబూ ?

నీల : అయితే - అదికాదు——

సీతా : మరేమిటి ?

నీల : (సమాధానం చెప్పలేక గట్టి చిక్కులో పడిపోతాడు)

సీతా : నీలకంఠం ! ఏమిటి నువ్విట్లా ప్రతివిషయానికి భయంతో వణకిపోతావ్ ? నాక్కూడా చెప్పటానికి వీల్లేని రహస్యమేదో నీమనస్సును చీకాకుపరుస్తోంది. నాముందరే నీకెందుకు నాయనా దాపరికం ? చెప్పు ? నీ భయానికి కారణమేంటి ?

నీల : నేను భయపడుతున్నాను - అవును భయమే ! అంతా భయం. అంతా బాధ - అమ్మా (ఏడుస్తాడు)

సీతా : నీలకంఠం ! (సముదాయిస్తూ) యేమిటి భయం ? ఏమిటి బాధ ? చెప్పు నాయనా ? చెప్పు ?

నీల : ఏమని చెప్పను? యేం చెప్పను? ఏమీ చెప్పలేనమ్మా—

సీతా : చెప్పలేనివాడివి ఆందోళన పట్టందేనికి ? శాంతంగానైనా వుండు నాయనా ?

నీల : శాంతంగానా ! ఎట్లా ? నాకు శాంతెట్లా లభిస్తుంది ? చెప్పుతానమ్మా — చెప్పుతాను. ఆ ప్రత్తాలు

వ్రాసింది......ఆ వుత్తరాలు వ్రాసింది ఒక్కడే – ఇక్కడ నుంచీ వెళ్ళిన యిద్దరిలో...ఇద్దరిలో ఒక్కడే మిగిలివున్నాడమ్మా (దూరంగా వెళతాడు.)

సీతా : ఆఁ—ఏమయ్యాడు ?

నీల : చచ్చిపోయాడు.

సీతా : (నెమ్మదిగా) కాసులు చచ్చిపోయాడు. (నీలకంఠాన్ని సమీపించి) కాసులు చచ్చిపోయాడా నీలకంఠం ?

నీల : (వెర్రిగా చూస్తూ; నెమ్మదిగా) కాసులు చచ్చిపోయాడు. కాసులు చచ్చిపోయాడు. (బిగ్గరగా) కాసులే చచ్చిపోయాడమ్మా—

సీతా : అయితే అతనిపేరిట కూడా నువ్వే యెందుకు వుత్తరాలు వ్రాశావ్ ?

నీల : అక్కడే పొరపాటు జరిగింది.

సీతా : ఈ సంగతి తిరపతికి చెప్పావా ?

నీల : చెప్పాను.

సీతా : అందుకే అతడు గుండెపగిలి చచ్చిపోయాడా ?

నీల : అవును.

సీతా : అయ్యయ్యో ! కొడుకుకోసం యెదురుచూస్తున్న తిరపతికి ఎంత ఆశాభంగం కలిగింది. ఇన్నేళ్ళనుంచి అతని కెందుకింత ఆశ కల్పించావురా నాయనా ! పాపమిా కృష్ణానందం దిక్కులేనివాడయ్యాడే ! (కుడివైపునుండి విశ్వం, సాంబమూర్తి, గోకర్ణం ప్రవేశం)

విశ్వం : వాడికేం దిక్కు లేక వాళ్ళన్నయ్యున్నాడుగా !

సీతా : ఇంకెక్కడున్నయ్యరా ! ఇప్పటిదాకా నీలకంఠం అతని సంగతే చెప్తూనున్నాడు.

విశ్వం : ఏమని చెప్పాడేమిటి ?

సీతా : కాసులు చచ్చిపోయాడట ! మీ బావే అతని పేరిట కూడా వుత్తరాలు వ్రాశాడట.

విశ్వం : (ఆలోచనలో పడతాడు)

సాంబ : మహాదేవశంభో ! చచ్చిపోయినవాడు కాసులా ?

సీతా : అదేంటన్నయ్యా ! అట్లా అడుగుతున్నావ్ ?

విశ్వం : ఏమని అడగమంటావత్తయ్యా ! ఆఖరికి మనం చచ్చిపోయినవాణ్ణి బ్రతికినవాణ్ణి గుర్తుపట్టలేని పరిస్థితిలో కొచ్చాం. మొత్తంమీద నీలకంఠం బావో, కాసులో ఎవరో ఒక్కరు మాత్రమే వుండి వుంటారనే నా పరిశోధన రుజువైంది. నామాటల్ని మొట్టమొదట్లోనే ఎగరగొట్టేశే మీరంతా యికనైనా సావధానంగా వుండండి. బయటికెళ్ళితే నాన్నగారితోసహా మా అందరికీ తెలిసిన విషయమేమిటంటే — బ్రతికున్నవాడు కాసులేనని —

సీతా : (గట్టిగా) విశ్వం. నీ పరిశోధన ఇక్కడెవ్వరికీ అక్కర్లేదు. బ్రతికున్నవాణ్ణికూడా నమ్మలేని దౌర్భాగ్యస్థితిలోకి దిగజారి మాట్లాడకు – అన్నయ్యా ! ఏమిటి మీకు బయటికెళ్ళితే తెలిసింది ?

సాంబ : (విశ్వంవంకచూచి) వాణ్ణే యేడవమను—

సీతా : ఏమిట్రా విశ్వం?

విశ్వం : నాకెందుకు మధ్యన – ఆ తిరపతి కొడుకునే అడుగు.

నీల : (కొరడాదెబ్బ తగిలినట్టు ఉలిక్కిపడతాడు.)

సీతా : యేమన్నాడురా ఆ తిరపతికొడుకు?

విశ్వం : అనేదేముంది! వాళ్ళన్నయ్య వచ్చాడన్నాడు. ఆరావటం మనింటికే వచ్చాడట. (నీలకంఠాన్ని చూపి) ఇడుగో ఈయనే కాసులు. ఇతడే తాను కాసులునని స్వయంగా తిరపతితో చెప్పాడు. అయితే నీలకంఠంగా అతని స్థానాన్ని ఆక్రమించుకోటానికి తండ్రి అనుమతిని కోరాడట. ఎంత మాలవాడైతే మాత్రం యేతండ్రి తన కొడుకు ద్రోహబుద్ధిని సహిస్తాడు. అందుకే అతడు కొడుకు చేసిన పనికి తలెత్తుకొని తిరగలేక అవిటిగా వున్న తన ప్రాణాన్ని కాస్తా వదిలాడు. కృపానందం మాత్రం తన అన్నను ఎట్లా వదులుకుంటాడు? వెళ్ళి చూడండి; అక్కడ యేమని చెప్పి నెత్తీ నోరూ బాదుకొని యేడుస్తున్నాడో!

సీతా : (నీలకంఠంతో) నాయనా అక్కడకు వెళ్ళి నువ్వు కాసులునని చెప్పావా?

నీల : అవునమ్మ, చెప్పాను.

సీతా : (విశ్వంతో) చెప్పకేం జేస్తాడు. కాసులు మరణించాడని వ్రాయటానికే మొహమాట పడినవాడు ఆవిషయాన్ని మొదటవాడి మాత్రం ఎట్లా చెప్పగలుగుతాడు?

కాసులు బ్రతికేవున్నాడని శ్రీపతికి భ్రమ కలిగించి అతనికి సంతృప్తి కలిగించాలని చూట్టం తప్పేమీ కాదు.

విశ్వం: అలాగా? అయితే కృపానందం చెప్పే మాటలన్నీ అబద్ధాలేనా? తిరపతి కాసుల్ని గుర్తుపట్టాడు. ఇద్దరూ కౌగలించుకున్నారు. ఏడ్చారు. ఇప్పుడు వెళ్ళి కృపానందానికి తాను కాసుల్ని కాదని చెప్పమను. అతని మరణాన్ని ధృవపరుస్తూ గవర్నమెంటుకు వ్రాసి తెప్పించమను. రంగంతా బయటపడుతుంది. ఇక్కడకు వచ్చిన దగ్గర్నుంచీ అసలు మనిషే అదోకరకంగా వుంటున్నాడు. లేకపోతే కుసుమను వివాహం చేసుకోటాని కెందుకంత భయం? ఇవన్నీ మీరితణ్ణి ఎందుకడగరు? మీరే ఎందుకు వెనకేసుకొస్తారు?

సీతా: ఇంతకీ నీకు నీలకంఠం బ్రతికుండటం ఇష్టం లేదురా విశ్వం—

సాంబ: సీతారామ్మా – ఏమిటీ నువ్వంటున్నది?

సీతా: అవునన్నయ్యా – ఈ దిక్కులేని ఆడది తన ఆస్తికి వారసుడంటూ నిలుపుకోటం—

సాంబ: ఆఁ...అదా! వీడి ఏడుపంతా. (విశ్వాన్ని సమీపించి) ఏరా దౌర్భాగ్యుడా? మనమ్నలో ఒకటిపెట్టుకొని మాటల్లో ఒకటంటరా నీకు? (రౌద్రుడై) ముద నష్టపు ఆస్తులన్నీ పోగేసుకొని ముచ్చటగా బ్రతుకుదామనుకున్నావా? సిగ్గెట్లా లేకపోయిందిరా నీకు.

ఇక నువ్వు నాయింట్లో ఒక్క క్షణంకూడా వుండ టానికి వీల్లేదు. బయటికి నడుప్. నడవరా (కర్రతో నెట్టుతాడు.)

నీల : ఆగండి. ఆయనేమీ తప్పుచెయ్యలేదు. అంతా నిజమే చెప్పాడు. నేనే కాసుల్ని.

సాంబ : (ఆగి) ఏఁమిట్రా యిది మహాదేవశంభో !

సీతా : నాయనా నీలకంఠం. నీకేమైనా మతిపోయిందా ?

నీల : లేదు. నిజంగానే నేను తిరపతి కొడుకును. కృపానందం నాతమ్ముడు.

సాంబ : ఆఁ...కాసులుగాడివా ?

నీల : అవును; ఈ గాడూ గీడూ ఇక మీరు నన్నంటారని నాకు తెలుసు. అలా అనే అసలు మీరింతవరకూ తీసుకొచ్చారు. నీలకంఠం దిక్కులేని చావు ఛావ టానికి కారణం మీరే! మీ ఛాందసత్వమే మమ్మల్ని మా తల్లిదండ్రులకు దూరంచేసింది. తిరపతి కొడుకునని నేను చెప్పేవరకూ తెలుసుకోలేని మాలకులం నాకిప్పు డెక్కడనుంచీ వచ్చింది? ఈ గుణపాఠం మీకు నేర్పా లనీ. ఈ నీచమానవుణ్ణిగా విముక్తి చెందాలని నేను చేసిన ప్రయత్నం విఫలమైంది. నాతండ్రి గుండెపగిలి మరణించాడు. నేను కాసులుగానే మిగిలిపోక తప్పలేదు.

సీతా : నాయనా నీలకంఠం! ఏమిటి నీవాగుడు? నీలకంఠాన్ని చంపి ఎందుకు నా కడుపున చిచ్చుపెడతావ్. చచ్చి పోయిందనుకున్న కొడుకు తిరిగివచ్చాడని కాస్త తేరుకున్నాను. యిప్పుడేగా నీవన్నావ్. నాయనా!

నీలకంఠాన్ని నేనే అను - అను - నేనే నీలకంఠాన్ని అను - నా కొడుకువి - నువ్వే నా కొడుకివి - అను - అను - అను - (భుజాలు పట్టుకొని వూపుతుంది)

నీల : (తల అడ్డంగా ఊపుతూ) కాదమ్మా కాదు. నేను నీల కంఠాన్ని కాదు. కాసులుగాణ్ణి. మాలవాణ్ణి. నా ప్రాణ స్నేహితుడు నీలకంఠం మరణించాడమ్మా—

సీతా : ఆఁ...మరణించాడా! నాకొడుకు మరణించాడా? నీవే నీలకంఠాన్ని అని ఒప్పుకోవూ? నా కొడుకును చంపుతావా? చంపు - నాయనా - నీలకంఠం (క్రింద పడిపోతుంది.)

[ సాంబమూర్తి ఈ చిక్కును వదిలించుకోలేక వ్యథ చెందుతాడు. గోకర్ణం పరిగెత్తుకొని వెళ్ళి నీళ్ళు తెస్తాడు. కుసుమ 'అత్తయ్యా' అని ప్రవేశించి సీతా రామ్మను వొళ్ళోకి తీసుకొని యేడుస్తుంది. విశ్వం గాలి విసురుతాడు. ]

నీల : (సీతారామ్మ నుద్దేశించి) నేనీ యింట్లో ప్రవేశించా లని అనుకున్నప్పుడు మీ మాతృహృదయాన్ని గురిం చిన ఆలోచన నాకు లేకపోయింది. నా వుద్దేశం నెర వేరుతుందనుకున్నాను. కాని ఒకప్రక్క నిర్మలమైన మాతృప్రేమ - మరొకప్రక్క పూజనీయమైన పితృ వాత్సల్యం; ఇంకొక దిశ కుసుమాదేవి నీలకంఠంపై పెట్టుకున్న ఆశలు అన్నీ కలసి ఒక పెద్ద సుడిగుండంగా తయారై నన్ను దిక్కు తోచనివానిగా చేశాయ్.

ఇందులో ఎవరిని మోసగించి యేమి చేద్దామన్నా నా అంతరాత్మ సహించలేకపోయింది. అందుకే పెళ్ళికి వ్యతిరేకించి ఆమె మనస్సుకు కష్టం కలిగించాను. తండ్రి మరణానికి కారణమయ్యాను. ఇక మీకూ యెక్కడ అటువంటి ప్రమాదం కలుగుతుందోనని నిజం దాచాలని ప్రయత్నించాను. కాని ఈ మోసం యింకా యిలాగే కొనసాగితే ముందు ముందు మీ కుటుంబంలో కలిగే పరిణామాల కన్నింటికి నేనే బాధ్యుణ్ణవుతాను. అందుకని నేను బయటపడక తప్పలేదు. అమ్మా – నిజంగా నువ్వు మాతృస్వరూపిణివి. పవిత్రమైన మాతృత్వానికి ద్రోహం తలపెట్టిన నన్ను క్షమించమ్మా. లేకపోతే నా స్నేహితుడు నన్ను క్షమించడు. నీచమైన కులంతో పాటు ఇదొక అపఖ్యాతిని నేను మోయలేనమ్మా– (సీతారామ్మ పాదాలను దూరంగా వంగి నమస్కరిస్తాడు.)

సాంబ: మహాదేవశంభో! ఏమిటీ పరీక్ష నాకు. నా చెల్లెలికి పుత్రశోకాన్ని కలిగించిన పాపం నా నెత్తికే వచ్చిందా? తిరిగి వచ్చాడుగదా అని సంతోషపడితే అంతా కలగా కరిగిపోయిందా? ఎంత పాపం చేశాను...ఎంత పాపం చేశాను మహాదేవశంభో – (యేడుస్తాడు)

విశ్వం: ఇంకా యేడిస్తే యేం లాభం నాన్నా! పోయినవాడు పోగా నేను కనిపెట్టి వుండకపోతే మన కుటుంబం అపఖ్యాతి పాలయ్యేది. ఈ పెద్దమనిషికి మనందరం సేవ

చెయ్యవలసి వచ్చేది. నీ మీదేదో పగ సాధించాలని చెప్పే మాటలన్నీ శుద్ధ అబద్ధం. అసలు బావ చచ్చిపోయాడో - ఇతడే చంపాడో —

నీల : (ఉగ్రుడై లేచి) నోర్మూయ్ అలుసు దొరికిందని చెప్పి నోటికొచ్చినట్లల్లా వాగకు. కులానికి పెద్దవని గుణానిక్కూడా పెద్దవనుకుంటున్నావేమో —

సాంబ : (కోపంగా) ఇంతవరకూ ఆడిన నాటకం చాలక ఇంకా నోరుకూడా పారేసుకుంటున్నావేమిటోయ్. ఛండాల కులంలో పుట్టి ఎంత ద్రోహం చేశావురా మహాదేవ శంభో. తరతరాలనుంచి మచ్చనేది లేకుండా పేరు ప్రఖ్యాతులు సంపాదించిన నా కులమర్యాదలన్నీ మంట గలిపావ్. ఊరివెలుపల పడి చావాల్సిన నువ్వు పవిత్రమైన నాయింటి ప్రతిమూలా అపవిత్రం చేశావ్. ఇన్ని రోజులుగా మా కంచాల్లో తిని, మా మంచాల్లో పడుకొని నేమిక బ్రతకటానిక్కూడా వీలులేకుండా చేశావ్. ఇంకా కొన్నాళ్ళపాటాగితే నయానో - భయానో నా కన్నకూతురుక్కూడా మాలవెధవతో తాళిగట్టించే మహాపరాధం జరిగిపోయేది. మహాదేవ శంభో - నేనిప్పుడెట్లా పరిశుద్ధుణ్ణయ్యేది? ధర్మశాస్త్రాలలో దీనికేమైనా విరుగుడుందా? యేమో-యేమో-

నీల : మానవుడని గౌరవించి సత్కరించటంకంటే - మాలవాడని వెలివేసి హింసించటం న్యాయమనేయే ధర్మశాస్త్రాలు మీకు నూరిపోసినట్ల్యా - [illegible]

మీ శరీరంలో యెంత జీర్ణించుకొనిపోయిందో మిమ్మల్ని చూచైనా లోకం అర్థం చేసుకోకపోలేదు.

విశ్వం : అంతటితో ఆపండి మీ హితబోధ ! యేముఖం పెట్టుకొని యింకా మా నాన్నగారితో యెదురు మాట్లాడుతున్నావ్ ?

సాంబ : మాటలతో పనేమిటింకా బయటికి గెంటండిరా మహాదేవశంభో !

విశ్వం : (నీలకంఠాన్ని సమీపించబోతాడు.)

నీల : ఆగు. నిజం చెప్పింది మీచేత గెంటించుకోటానిక్కాదు. నేనే వెళ్లిపోతాను.

సాంబ : ఛో. గోకర్ణం – వాడి సామానులు తీసుకొని బయట పడేయ్. (సీతారామమ్మ లేస్తుంది.)

గోక : గన్నెదొరా ! (నీలకంఠం సామానులు ఒక్కొక్కటీ లోపలనుంచీ తీసుకొని కుడివైపుకు విసిరిపారేస్తాడు)

నీల : (ముందుకు సాగుతాడు)

సీతా : (లేచి) ఆగు నాయనా !

నీల : క్షమించు తల్లీ !

సీతా : అన్నయ్యా ! ఇంట్లోనుంచి ఎవరిని బయటికి తరమ్మంటున్నావ్ ?

సాంబ : కానులుగాణ్ణి.

సీతా : ఏది ?

సాంబ : [illegible]

సీతా : అతడు నాకొడుకు; నీలకంఠం.

విశ్వం : ఇంతవరదాకా జరిగిందేమిటి ? నీలకంఠం చనిపోయాడని తెలియలా ?

సీతా : చనిపోయింది నీలకంఠం కాదు; కాములు.

నీల : కాదమ్మా—

సీతా : అవును నాయనా ! నువ్వే నీలకంఠానివి. ఒక్కగాను ఒక్క నాకొడుకివి.

సాంబ : సీతారామ్మా ! యేమిటి నీకింకా ఆభ్రమ. నీలకంఠం చనిపోయాడోనని చెప్తుంటేనూ—

సీతా : నీలకంఠం చనిపోయాడని అతనిని కన్న నేననుకోలే నన్నయ్యా ! ఇక్కడే మనిద్దరికి తేడా—

సాంబ : అయితే ఇతణ్ణే నీలకంఠం అనుకోమంటావా ?

సీతా : నేనలాగే అనుకుంటాను.

విశ్వం : ఒక పరాయివాడూ, మాలవాడూ అని చెప్తుంటే యేమిటత్తయ్యా యీ వేదాంతం ?

సీతా : అవును; ఇది వేదాంతమే విశ్వం. ఇతడు మాలవాడెట్లా అయ్యాడు ?

విశ్వం : తిరపతిగాడి కడుపున పుట్టాడు గనుక—

సీతా : నీ వెట్లాకాలా ?

విశ్వం : నీకు తెలియదా ?

సీతా : తెలుసు; ఈయింట్లో పుట్టావు గనుక – కానిఒకక్షణం ముందువరకూ మీ నాన్నతోపాటందరూ ఇతణ్ణెందుకు గౌరవించారు ?

విశ్వం : మాలవాడని తెలియక —

సీతా : నిన్నెందుకు గౌరవించలా? నీవు మాలవాడివికాదని తెలియకా? కాదు. గుణం తక్కువ వాడివని – కులమేమైనా గుణం ప్రధానమని యిప్పటికైనా తెలిసిందా?

విశ్వం : ఏమిటి గుణం? దొంగవేషాలతో ఒక కుటుంబంలో జొరబడి ఆ స్త్రీని, పిల్లని కాజేద్దామనా?

సీతా : వాటినితడు తనక్కావాలని కోరాడా?

సాంబ : ఇంతకీ యేమిటి సీతారామ్మా? మాలవాణ్ణి యింట్లో పెట్టుకుందామంటావా?

సీతా : కాదు. కడుపులో పెట్టుకుందామనుకుంటున్నాను. ఇతను నాకొడుకే నన్నయ్యా. ఇతడు లేకపోతే నా మాతృత్వం సర్వనాశనమై పోతుంది. ఇతని అంతరాత్మలో నీలకంఠమే వున్నాడు. అతణ్ణి నేను గుర్తించగలిగా నన్నయ్యా! మీకు కనిపించకపోతే నాకూ కనిపించకుండా చేస్తారా? ఇదన్యాయం, నా బాధ మీరు తెలుసుకోండి. నాకొడుకును నాకు దూరం చెయ్యొద్దు. నాయనా! (నీలకంఠాన్ని కౌగలించుకుంటుంది.)

నీల : అమ్మా! ఈ ప్రపంచంలోని మాతృత్వమంతా నీవే నమ్మా – నీకు నేనొక్కణ్ణే నీలకంఠాన్ని కాదు. మాన

వులందరికీ నీవు మాతృస్నేహము పంచి యివ్వగలవు తల్లీ! ఇంత విశాలమైన నీ హృదయము కులాలు - మతాలు అడ్డగించగలవా అమ్మా—

సీతా : (కౌగిలి వదిలి) నాయనా నేనేమీ దేవతను కాను. సామాన్యమైన తల్లికి వుండే ప్రేమ నాకూ వుంది. ఆ ప్రేమ నిలుపుకోటానికి నీవు నాకాధారం. తల్లిగా నాకు నా బిడ్డను కలిగించిన మనోభావమే నా అంతః కరణను పరిశుద్ధం చేసింది. పరిశుద్ధమైన అంతరంగానికి సమస్త ప్రపంచమూ ప్రేమపూరితంగానే కనిపిస్తుంది. ప్రేమపూరితమైన ప్రపంచంలో నివసించటమే మోక్ష ప్రాప్తి. మోక్షప్రాప్తికి నాకు నీవే తపస్సు. రాబాబూ— (నీలకంఠాన్ని తీసుకొని పడమటివైపుకు తిరుగుతుంది.)

విశ్వం : ఎక్కడికి ? నాన్నా యేమిటి నీ మానం ?

సీతా : అన్నయ్యా—

సాంబ : సీతారామ్మా—

సీతా : ఇతడెవరు ?

సాంబ : నాకు తెలియదమ్మా !

విశ్వం : నాన్నా !

కుసుమ : నాన్నా ! (తండ్రిని సమీపించి) ఆ త్తయ్య ఇతణ్ణి నా కుమారుడేనని చెప్తుంటే నువ్వు నాకు తెలియదంటూవేమిటి ? చివరికి నువ్వే ఇట్లా అయిపోతే అ త్తయ్య మనస్సెంత బాధపడుతుందో ఆలోచిస్తున్నావా ?

విశ్వం : కుసుమా. అత్తయ్యా నవ్వ్వా పడే బాధేమిటి?

సాంబ : ఆలోచిస్తున్నానమ్మా - ఆలోచిస్తున్నాను. మహాదేవ శంభో! ఎంత ప్రయత్నించినా నా ఆలోచన మీ అత్తయ్యంత లోతులను వెతకలేక పోతుందమ్మా - నాకు నాకిక జీవితం అడ్డొస్తోంది. దానిని దాటగలశక్తి నాకు లేదు. మహాదేవశంభో నాకు లేదు—

విశ్వం : శక్తి. ఏమిటాశక్తి? ఎందుకు మీరిట్లా లొంగిపోతున్నారు? నాన్నా! మీరేగదా యిప్పటిదాకా మాలవాడని - ఛండాలుడని - అపవిత్రం చేశాడని - నానాతిట్లూతిట్టిసామానులన్నీ బయటపారేయించి గెంటమన్నారు?

సాంబ : గెంటు. ఏమన్నా చెయ్యి. నేను మాత్రమింకేమీ చెయ్యలేను మహాదేవశంభో - ఏమీ చెయ్యలేను. (లోపలికి వెళ్ళిపోతాడు.)

కుసుమ : నాన్నా! నాన్నా! (వెన్నంటి లాభంలేక వెనక్కి తిరిగి ఆగిపోతుంది.)

విశ్వం : సరే; అలాగయితే - అత్తయ్యా అతణ్ణి నువ్వొదులు.

సీతా : ఎందుకు?

విశ్వం : నా యింట్లో అతడుండటానికి వీల్లేదు.

సీతా : నీయిల్లా?

విశ్వం : అవును; నాయిల్లు.

సీతా : అయితే నువ్వే ఈ యింట్లో వుండు నాయనా - (సీల కంఠంలో [illegible] మళ్ళి కుడివైపుకు దాటిపోతుంది.)

కుసు : (పరిగెత్తుకొని వెళ్ళి) అత్తయ్యా—

విశ్వం : (ఉగ్రుడై) కుసుమా; నువ్వెక్కడికి?

కుసు : ఈ యింట్లో నేనూ వుండను.

విశ్వం : వుండకెక్కడికెళ్తావ్ ?

కుసు : నా భర్తతో పాటే నేనూ—

విశ్వం : మాలవాడు మొగుడెట్లా అవుతాడే నీకు—

కుసు : మీకు కావలసినవాడైనప్పుడు నాకు భర్తయి; మాల వాడని తెలిస్తే కాకుండా పోడన్నయ్యా.

విశ్వం : ఎందుకాకుండాపోడూ – నీ ఆటలిక్కడేమీ సాగవు.

కుసు : నీ యిష్టప్రకారం నడుచుకోటానికి నేనేమీ యంత్రాన్ని కాదు.

విశ్వం : యంత్రానివికావే–(గభాలున చెయ్యిపుచ్చుకొని) రా–

కుసు : రాను – నన్నొదులు (వదిలించుకుంటుంది.)

విశ్వం : రాకేం చేస్తావు. నిన్నీయింట్లోనుంచి గడపదాట నివ్వను.

కుసు : దాటనివ్వకుండా యీ యింట్లో నువ్వు నాశవాన్ని మాత్రమే చూస్తావ్.

సీతా : అమ్మా; కుసుమా! యేమిటీమాటలు? నాయనా విశ్వం! ఏమిట్రా యిదంతా?

విశ్వం : ఇవి మా యింటి విషయాలు. ఇతరుల జోక్యం అనవసరం.

సీల : అవసరమే—

సీతా : నువ్వాగు నాయనా —

విశ్వం : కుసుమా! ఇదొకసారిచెప్తున్నాను. ప్రాణంతీసుకుంటా నని బెదిరించినా నిన్నిక్కడనుంచి కదలనియ్యను.

కుసు : కదలనియ్యకుండా నువ్వే నన్నేం చెయ్యలేవు.

విశ్వం : చెయ్యలేనే - (కుసుమను బలవంతంగా లాక్కుపోతాడు. కుసుమ 'నాన్నా, అత్తయ్యా, బావా,' అని గట్టిగా అరుస్తుంది.)

సాంబ : (త్వరగా ప్రవేశించి) విశ్వం; వదిలెయ్ దాన్ని —

విశ్వం : నాన్నా మీ రెవ్వరూ నాకడ్డం రాకండి.

సాంబ : ఈ ఇంట్లో నీకేం అధికారం లేదు. దాన్ని వదులుతావా లేదా ? (విశ్వం కుసుమచెయ్యి వదిలేస్తాడు. కుసుమ 'నాన్నా' అని సాంబమూర్తిని చేరుతుంది.)

విశ్వం : ఆఁ...ఈ ఇంట్లో నాకేం అధికారం లేదా ?

సాంబ : లేదు.

విశ్వం : లేదా ?

సాంబ : లేదు. ఈయింటి అధికారాలను నీచేతుల్లో పెట్టినా అనే వాళ్ళందరినీ సర్వనాశనం చేసుకోలేను. [illegible] జీవితం కొరకు మనిషికీ మనిషికీమధ్య యేర్పడిన ప్రేమ బంధాలను నిర్దాక్షిణ్యంగా తెగనరకలేను. మహాదేవ శంభో - ప్రేమకు స్వేచ్ఛవుంది. దానికిఅడ్డుకట్టలు వేసే అధికారం నీకూ నాకూ ఎవరికీ లేదు.

విశ్వం : అయితే చిటికె మీరెంతా ఒకటే అయ్యారన్నమాట ! వెలివెయ్యబడినవాణ్ణి ఆఖరికి నేనే అయ్యాను. ఈ పాడు కొంపలో యికమీరే వుండండి. మీరే వుండండి. (చరచరాకుడికి నిష్క్రమిస్తాడు.)

సీతా : విశ్వం. నాయనా—

సాంబ : అమ్మా; సీతారామ్మా ! ఈ గడపవిడిచి వాడెక్కడికీ వెళ్ళడు. వృథాప్రయాసగా వాణ్ణెందుకు పిలుస్తా వమ్మా—

సీతా . అన్నయ్యా; ఇక మాకు శెలవిప్పించు.

కుసు : అత్తయ్యా – మీరెక్కడికి వెళ్తారు – నాన్నా—

సాంబ : అవునమ్మా వాళ్ళెంకా యెక్కడికీ వెళ్ళరు.

సీతా : కుసుమా !

కుసు : అత్తయ్యా; (కౌగలించుకుంటుంది.)

నీల : (మౌనంగా సాంబమూర్తికి పాదాభివందనం చేస్తాడు. అన్నయ్యా అని కృపానందం కుడినుండి పరిగెత్తుకొని వస్తాడు. గోకర్ణం బయట పారేసిన సామానులను తిరిగి తీసుకొస్తాడు.)

సీతా : (కృపానందాన్ని) నాయనా ! (అని దగ్గరకు తీసుకుంటుంది.)

నీల : (లేచి) చివరికి మీ స్త్రీజాతిలోని సమర్పణ భావమే వన్నొక మానవునిగా రూపొందించింది. పవిత్రమైన మీ ప్రేమతో చనిపోయిన నీలకంఠాన్ని లేపి కూర్చో

బెట్టాడు. అమ్మా! (సీతారామ్మ పాదాలను స్పృశి స్తాడు. కుసుమకూడా నీలకంఠంతో పాటు సీతారామ్మ పాదాలను నమస్కరిస్తుంది.)

సీతా : నాయనా - (దీవిస్తుంది.)

సాంబ : (శ్లోకం మహాత్మునికి దోసిలొగ్గి అంటాడు. మిగతా వారంతా మహాత్మునివంక చూస్తూ ముకుళిత హస్తాలతో నిలబడతారు.)

యదాయదాహీ ధర్మస్య గ్లానిర్భవతి భారత,
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహం.



1958 జూన్‌లో గుడివాడలో జరిగిన ఆంధ్ర నాటక కళా పరిషత్‌లో పాల్గొన్న కర్నూలు అభ్యుదయ కళాసమితి



కూర్చున్నవారు ఎడమనుండి :- శ్రీ వి. ఉమామహేశ్వరరావు, (సాంబమూర్తి) శ్రీమతి సి. సరస్వతి, (కుసుమ)
శ్రీమతి యం. యస్. శకుంతలాదేవి,(సీతారామమ్మ) శ్రీ ఏ. కోదండరామయ్య,(విశ్వా)

నిలుచున్నవారు ఎడమనుండి :- శ్రీ ఐ. లింగన్న, (గోకర్ణం) కుమారి వై. యస్. దుర్గాదేవి (సౌభాగ్యం)
శ్రీ వై. డి. ప్రసాదరావు, (తిరుపతి) శ్రీ డి. సోమేశ్వరరావు (నీలకంఠం)

చదవండి !                                        ప్రదర్శించండి : !

* వినోదాత్మకమైన

* విజ్ఞాన దాయకమైన

* ప్రదర్శన యోగ్యమైన

ఉత్తమ నాటకములు :

| | |
|---|---|
| ఫణి | 1-50 |
| మనసు మారిన మనిషి | 1-25 |

నాటికలు :

| | |
|---|---|
| అనంతం | 0-75 |
| లైసెన్సు | 0-75 |
| పురోగమనం | 0-37 |

-: ప్రతులకు :-

# నవోదయ పబ్లిషర్సు-విజయవాడ.2